చందా వివరములు
ఆంధ్ర దినపత్రిక

| (ఆదివారపు సంచికలో సహా) | | రూ. | [నయా పైసలు] |
|---|---|---|---|
| సంవత్సర చందా | ... | 28 | 00 |
| అర్ధ సంవత్సర చందా | ... | 14 | 00 |
| 3 మాసముల చందా | ... | 7 | 00 |
| నెల చందా | ... | 2 | 50 |
| విడి ప్రతి సాధారణ దినములలో | ... | ,, | 7 |
| ఆదివారపు దినపత్రిక | ... | ,, | 13 |

ఆంధ్ర పత్రిక — మద్రాసు-1.

# ఆంధ్రపత్రిక





THE ANDHRA PATRIKA (WEEKLY EDITION) MADRAS సంపుటం 44. సంచిక 96 FOUNDER: DESODHARAKA K. NAGESWARA RAO ఆదివారం 7-7-1957 Reg. No. M. 5745 10 పేజీలు 13 నయాపైసలు


# హరిజనులకు ఇళ్లస్థలాలు ఇప్పించడానికి కేంద్ర సహాయావశ్యకత

## సురావర్దీ, మాక్మిలన్, నెహ్రూల సమావేశం

### భారత పాక్ సంబంధాలపై అంతరంగిక సమాలోచనలు

లండన్, జూలై 5: భారత, పాకిస్తాన్, బ్రిటిష్ ప్రధాన మంత్రులు శ్రీ జవహర్లాల్ నెహ్రూ, శ్రీ హెచ్. సురావర్దీ, శ్రీ హెరాల్డు మాక్మిలన్‌లు ఇవాళ మధ్యాహ్నం బ్రిటిష్ ప్రధాని కార్యాలయంలో సమావేశమై, కాశ్మీరు, పంజాబు నదీజలాలు, తూర్పుపాకిస్తాన్ నుంచి శరణార్థుల రాకడ మొదలైన భారత పాకిస్తాన్ సమస్యలు అన్నిటినీ చర్చించారు.

ముగ్గురు ప్రధానమంత్రులూ కలుసుకుని అంతరంగిక సమాలోచనలు జరపాలని బ్రిటిషు ప్రధాని శ్రీ మాక్మిలన్ చేసిన సూచనకు శ్రీ నెహ్రూ సమ్మతించడం విలక్షణమేమీ లేదని భారత ప్రతినిధివర్గానికి చెందిన ఒకరు అన్నారు. శ్రీ నెహ్రూ మొదటినుంచీ ఈ సమస్యలను ఎవరితో ఎక్కడ చర్చించడానికైనా ఎప్పుడూ సిద్ధమేనని స్పష్టంగా చెపుతున్న విషయమే.

క్రిందటి భద్రతామండలి సమావేశంలో బ్రిటన్ బహిరంగంగా పాకిస్తాన్ పక్షం వహించడంతో బ్రిటన్ భారత దేశాల మధ్య సంబంధాలు పాడైనందుకు బ్రిటిషు ప్రధాని శ్రీ మాక్మిలన్ ఎంతో ఆందోళన చెందుతున్నారని కొందరికి తెలుసు.

ఇవాళ్టి సమాలోచనల ఫలితంగా, ఈసారి భారత పాకిస్తాన్‌లకు సంబంధించిన విషయాలేవైనా సమితిలో చర్చకు వస్తే, బ్రిటన్ ఎటువంటివైఖరి అవలంబించాలో శ్రీ మాక్మిలన్ గ్రహించడానికి అవకాశం లభిస్తుంది.

శ్రీ నెహ్రూ మొదట బ్రిటిషు ప్రధాని కార్యాలయానికి వచ్చి మధ్యాహ్నపు విందు స్వీకరించారు. తరువాత పాకిస్తాన్ ప్రధాని శ్రీ సురావర్దీ వచ్చేవరకూ అక్కడే ఉండిపోయారు.

శ్రీ నెహ్రూ శ్రీ మాక్మిలన్‌తో అంతరంగిక సమాలోచనలు జరపడం వారం రోజుల్లో ఇది మూడోసారి.

గాంధీమహాత్మునికి అత్యంత సన్నిహితులు, భారతదేశంలో చాలయేళ్ళు ఉండి గాంధీజీతో కలిసి దేశసేవలో పాల్గొన్నవారు అయిన శ్రీ హోరేస్ అలెగ్జాండర్ ఇవాళ ఉదయం శ్రీ నెహ్రూను కలుసుకుని, వారి ఆతిథ్యం స్వీకరించారు.

1920 లో బ్రిక్స్టన్ కారాగారంలో 74 రోజులు నిరాహారదీక్ష పూని ప్రాణత్యాగం చేసిన ఐర్లండ్ స్వాతంత్ర్య వీరుడు టెరెన్స్ మెక్స్వినీ సతీమణి ఇవాళ ఉదయం శ్రీ నెహ్రూను దర్శించింది.

## అనుగ్రహనారాయణ్ మృతి

### బీహార్ ఆర్థికమంత్రి

పాట్నా, జూలై 6: బీహార్ ప్రముఖ కాంగ్రెసు నాయకుడు, రాష్ట్ర ఆర్థిక, వ్యవసాయశాఖల మంత్రి డా॥ అనుగ్రహనారాయణ సిన్హా, ఇవాళ అర్ధరాత్రి కొంచెం ముందుగా చనిపోయారు. వీరి వయస్సు 71 సంవత్సరాలు.

డా॥ సిన్హా కొద్దిరోజులుగా మూత్ర కోశ వ్యాధితో బాధపడుతున్నారు. క్రిందటి వారం ఎముక విరగడంచేత జూన్ 29 న ఆసుపత్రిలో చేర్చారు. ఈ ఐదు రోజులబట్టి, చావు బ్రతుకుల మధ్య ఆయన ఊగిసలాడుతున్నారు. జీవితపర్యంతం తన సహచరుడవడంచేత రాష్ట్రపతి డా॥ రాజేంద్ర ప్రసాద్ మొన్న ఢిల్లీనుంచి వచ్చి స్వయంగా పరామర్శించి వెళ్లారు.

డా॥ సిన్హాకు ఇద్దరు కుమారులు, ఒక కుమార్తె, మనుమలు మనుమరాండ్రు అనేకులున్నారు. కుమారులలో ఒకరు శ్రీ సత్యేంద్ర నారాయణ సిన్హా పార్లమెంటు సభ్యుడు. డా॥ సిన్హా చనిపోయే సమయంలో వీరంతా దగ్గరే ఉన్నారు. వీరు కాక, కేంద్ర ప్రభుత్వ తంతి తపాలాశాఖ మంత్రి శ్రీ లాల్ బహాదూర్ శాస్త్రి, బీహారు ఆహార, ఆరోగ్యశాఖల మంత్రి శ్రీ బీర్ చంద్ పటేల్ కూడా ఉన్నారు.

### జీవిత సంగ్రహం

డా॥ సిన్హా 1889 సంవత్సరంలో జన్మించారు. పాట్నాలోను, కలకత్తాలోనూ విద్య పూర్తి చేసుకొని, 1915 లో భగల్పూరులోని టి. ఎన్. జె. కళాశాలలో చరిత్రాధ్యాపకులుగా చేరారు. ఆ మరుసంవత్సరమే ఉద్యోగం మాని వేసి న్యాయవాది వృత్తిలో ప్రవేశించారు. 1921 వరకూ పాట్నా హైకోర్టులో న్యాయవాదిగా పనిచేశారు. 1917 లో గాంధీజీతో పాటు చాంపరాన్ రైతుల స్థితిగతుల దర్యాప్తులో పని చేశారు. సత్యాగ్రహ ఉద్యమంలో పాల్గొన్నారు.

1926 లో స్టేట్ కౌన్సిల్‌కు ఎన్నిక కావడంతో, శాసనసభా వ్యవహారాలలో వీరు పాల్గొనడం ప్రారంభమైంది. 1935 కేంద్ర శాసనసభకు, 1937 లో బీహారు రాష్ట్ర శాసనసభకు ఎన్నికైనారు. 1946 లో రాష్ట్ర శాసనసభకు ఎన్నికై మంత్రి అయినారు. చనిపోయేవరకూ, వీరు బీహారు మంత్రిగా వున్నారు.

స్వాతంత్ర్యోద్యమములో అనేక సార్లు జైలుకు వెళ్లారు. 1928 లో బీహారు కాంగ్రెసు అధ్యక్షుడు గానూ, 1934 నుంచి 36 వరకు, ప్రదేశ్ కాంగ్రెసు కార్యదర్శి గాను పనిచేశారు.

అనేక అంతర్జాతీయ సమావేశాలకు, భారత ప్రతినిధివర్గ నాయకుడుగా వెళ్ళారు.

డా॥ సిన్హా దేహాన్ని, ఆసుపత్రినుంచి అర్ధరాత్రే స్వగృహానికి ఊరేగింపుతో తీసుకొని వచ్చారు.

### ప్రభుత్వమర్యాదలతో అంత్యక్రియలు

ప్రభుత్వ మర్యాదలతో డా॥ అనుగ్రహ నారాయణ సిన్హా మృతదేహానికి ఇవాళ (6 వ తేదీ) అంత్యక్రియలు జరిగాయి. ప్రభుత్వ కార్యాలయాలన్నింటిపైనా సంతాప సూచకంగా జాతీయ జెండాలను సగం వరకు దించారు. రాష్ట్రమంతటా యీ మూడు దినాలు సంతాప దినాలుగా పరిగణిస్తారు.

డా॥ అనుగ్రహ నారాయణ సిన్హా మృతికి సంతాపం తెలుపుతూ, పశ్చిమ బెంగాల్ శాసనసభ ఆయనకు ఇవాళ జోహార్లర్పించింది. సభ్యులంతా ఒక నిముషం సేపు నిలబడి తమభక్తి గౌరవాలు ప్రకటించారు.

డా॥ సిన్హాకు జోహార్లు తెలిపే తీర్మానాన్ని సభాపతి శ్రీ ఎస్. బెనర్జీ ప్రతిపాదించారు.

## గ్రామాలతోపాటే వారి నివాసాలు ఏర్పాటు చేయించాలని సంకల్పం

### ధనం కావాలనీ, పని త్వరగా జరిపించే కృషి జరుగుతుందనీ శాసనసభలో మంత్రి ప్రకటన

హైదరాబాదు, జులై 6: కేంద్ర ప్రభుత్వం అమలు జరిపిన పథకం ప్రకారం రాష్ట్రంలోని హరిజనులకు నివేశన స్థలాలను చూపించేందుకు ధనసహాయ మివ్వవలసినదిగా కేంద్ర ప్రభుత్వాన్ని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం కోరిందని శాసనసభలో ప్రశ్నోత్తరాల సమయంలో సాంఘిక సంక్షేమశాఖమంత్రి శ్రీ డి. సంజీవయ్య చెప్పారు.

ఆంధ్రప్రాంతంలో 1956-57 లో హరిజనులకు నివేశనస్థలాలను చూపించేందుకని ప్రభుత్వం రు 611 వేలు వెచ్చించిందని ఈ సందర్భంలో వచ్చిన ఇతర ప్రశ్నలకు మంత్రి సమాధానం చెప్పారు. అస్పృశ్యతా నివారణ విధానం ప్రకారం గ్రామాలలో ఇప్పుడుంటున్న ఇళ్ళ సమీపంలోనే వీలయినంతవరకూ హరిజనులకు నివేశన స్థలాలను చూపించడానికి ప్రభుత్వం ప్రయత్నిస్తోందని హరిజనులకు నివేశనస్థలాలను ఇచ్చేపని త్వరగా జరగడానికి వీలుగా స్థలాల సేకరణ కార్యక్రమం జరిపించే సంగతిని ప్రభుత్వం శ్రద్ధగా ఆలోచిస్తోందని మంత్రి వివరించారు.

### తమిళంలో దేవతల పేర్ల మార్పు

మద్రాసు, జూలై 6: దేవాలయాలలోని దేవతలపేర్లను తమిళములో మార్చమని ప్రభుత్వం యెట్టి ఆదేశంగాని యివ్వలేదని యీ విషయమై యేలాంటి మార్పును ప్రభుత్వం యింతవరకు ఉద్దేశించలేదని అంతరంగిక వ్యవహారాల శాఖా మంత్రి శ్రీ యం. భక్తవత్సలం ఎగువసభలో శ్రీ పురుషోత్తం ప్రశ్నకు సమాధానంలో చెప్పారు.

కిలా చెరువుపట్టి తమిళసంస్థ అట్టి సూచన చేసిందిగాని అక్కడి దేవాలయాధికారులకు ఆ విషయమై యే ఉత్తరవునుగాని ప్రభుత్వం పంపలేదని కూడా మంత్రి తెలియజేశారు.

"దేవుళ్ల పేర్లలో కొన్నిటియందు ఆ దేవతలగుణము తెలియజేసే అర్థము ధ్వనిస్తుంది. "భగవాన్ మురుగన్" శాశ్వత యౌవనం యొక్క దేవుడు. దేవుళ్ల పేర్లను మార్చటానికి ప్రయత్నించేటప్పుడు ఆ దేవతల గుణాలను కూడా మారుస్తారా" అని శ్రీ చక్రయ్య చెట్టి అడిగారు.

గౌరవసభ్యుని అభిప్రాయంతో తాము ఏకీభవిస్తున్నామనీ, సాధారణ వచన రూపంలో దేవుళ్ల పేర్లను మార్చటానికి మాత్రమే యీ సూచన వచ్చినదని దేవతలపేర్లు మార్చటానికి ప్రయత్నించేముందు మనుష్యులపేర్లను మార్చడం గురించి కూడా ఆలోచించవలసి ఉంటుందని శ్రీ భక్తవత్సలం అన్నారు.

### మారిషస్ పాలనలో అనధికారులకు స్థానం

పోర్ట్‌లూయీ, జూలై 6: మారిషస్ దీవి పాలకమండలిలో ఐదుగురు అనధికార సభ్యులను నియమించారు. ఈ అనధికార సభ్యులను మంత్రులుగా పిలుస్తున్నారు. ఇక పాలకమండలిని మంత్రివర్గం అని వ్యవహరిస్తారు. ఈ దీవి రాజ్యాంగం ప్రకారం ఎగువ శాసనసభకు ఎన్నికైన నలుగురు అనధికారులకు ఇదివరలోనే స్థానం ఇచ్చారు. ఈ మంత్రిమండలిలో మరిముగ్గురు అధికార సభ్యులు ఉంటారు. మంత్రివర్గ సమావేశాలకు గవర్నరు అధ్యక్షత వహిస్తారు.

ఈ దీవి ఇప్పుడు బ్రిటన్ చేతులలో ఉంది.

### విద్యార్థులకు పాఠశాలల సహాయం

"పూర్వ ఆంధ్ర ప్రాంతంలోని 82 ఉన్నత పాఠశాలలు పాఠశాలల ధన సహాయ నిబంధనల ప్రకారం విద్యార్థులకు బుసుం మినహాయింపు సౌకర్యాలు మంజూరు చేసినవి. అయితే పాఠశాలల ఆర్థికపరిస్థితి సంతృప్తికరంగా లేకపోవటంవల్ల నిబంధనల ప్రకారం మంజూరు చేయడానికి వీలయిన గరిష్ఠ మినహాయింపు సౌకర్యం ఏ పాఠశాలా కూడా మంజూరు చేయలేద"ని విద్యాశాఖమంత్రి చెప్పారు.

### రుమేనియాలో వ్యష్టి వ్యవసాయానికి స్వస్తి

లండన్, జూలై 6: రుమేనియాలోని కాన్‌స్టాంటా ప్రాంతం అంతటిలోనూ సహకార సాగువిధానాన్ని ప్రవేశపెట్టారు. సహకార వ్యవసాయ విధానాన్ని అమలుపరచాక, ఒక పూర్తి ప్రాంతం అంతా ఈ విధానంలోనికి రావడం ఇదే ప్రథమం. ఈ ప్రాంతంలో వ్యష్టి వ్యవసాయానికి స్థానం లేదు.

### కోస్తాలో పెద్దవాన సూచన

మదరాసు, జులై 6: ఉత్తర కోస్తాలో 48 గంటల్లోగా పెద్దవాన పడే సూచన వుంది. ఇవ్వాళ ఉదయం నమోదుచేసిన లెక్కననుసరించి తెలంగాణాలో విస్తృతంగా రాయలసీమలో స్థానికంగా వర్షం పడింది. నిజామాబాదులో 12 సెంటిమీటర్లు, రామగుండంలో 7 సెంటిమీటర్ల వాన కురిసింది.

### ఎన్నిక చెల్లదని దరఖాస్తు

హైదరాబాదు, జులై 6: నిర్మల్ నియోజకవర్గం నుంచి ఆంధ్రప్రదేశ్ శాసనసభకు, శ్రీ ముత్యంరెడ్డి ఎన్నిక చెల్లదంటూ, నిర్మల్ వాస్తవ్యుడు శ్రీ నేరెళ్ళ హంపన్న దాఖలు చేసిన అభ్యంతరపు దరఖాస్తు విచారణ సికిందరాబాదులో జరుగుతుంది.

## ఖమ్మం పాఠశాలలో చాలినంత స్థలం లేదు

### 80 మంది విద్యార్థులు చదువు మానుకోవలసిన పరిస్థితి

ఖమ్మంమెట్టు, జూలై 4: స్థానిక పాఠశాలలో ఏడవ తరగతిలో చదివి కృతార్థులయిన విద్యార్థులకు ఉన్నత పాఠశాలలో తగినంత వసతి లేనందున ఈ సంవత్సరం 80 మంది విద్యార్థులు చదువు మానుకోవలసివచ్చింది.

ఈ పరిస్థితిని పరిశీలించేందుకు జిల్లా కాంగ్రెసు కార్యదర్శి శ్రీ హీరాలాల్ మోరియా, పట్టణ కాంగ్రెసు కార్యదర్శి శ్రీ చిరవెల్లి నరసింహారావు ఏర్పాటుచేసిన సభకు జిల్లా కాంగ్రెసు అధ్యక్షుడు శ్రీ కొలిపాక కిషన్‌రావు అధ్యక్షత వహించారు.

పాఠశాలలో విద్యార్థులకు తగినంత స్థలం లేదని ప్రధానోపాధ్యాయుడు శ్రీ హెచ్. వి. శర్మ వివరించారు. దాదాపు ప్రతిసంవత్సరమూ ఇటువంటి పరిస్థితి ఏర్పడుతున్నందుకు శ్రీ హీరాలాల్ మోరియా ఆందోళన వెల్లడించారు. పాఠశాలలో సౌకర్యాలు కల్పించేందుకు విరాళాలు ఇవ్వవలసినదిగా ప్రజలకు విజ్ఞప్తి చేశారు.

సౌకర్యాలు ఏర్పడేవరకూ 80 మంది విద్యార్థులనూ పాఠశాలలో ఏదో విధంగా చేర్చుకోవలసినదిగా శ్రీ నరసింహారావు కోరారు. సౌకర్యాలను ఏర్పాటుచేసే కృషి తక్షణం ప్రారంభమవుతుందన్నారు. ఈ ఏర్పాట్లు జరిపేందుకు ఒక ఉపసంఘాన్ని ఏర్పాటు చేశారు.

## మాలటోవ్ పత్తా తెలియదుట

### యుగోస్లావ్ దూతతో కృశ్చేవ్ గోష్ఠి

లండన్, జూలై 6: కమ్యూనిస్టు అగ్రనాయక వర్గంనుంచీ, మంత్రిపదవుల నుండీ బర్తరఫ్ అయిన మాలటోవ్, మాలెంకోవ్, కగనోవిచ్, షెపిలోవ్‌లు ఎక్కడున్నారో పత్తా తెలియడము లేదు.

పత్రికలలో రేడియోలలో మాత్రము వారు కమ్యూనిస్టుపార్టీలో అధికారము హస్తగతం చేసుకోవాలని కుట్ర పన్నారని విమర్శలు మాత్రమే వినవస్తున్నాయి.

వీరి బర్తరఫ్ తరవాత మళ్ళీ మరో పెద్దమార్పు త్వరలో ప్రకటితం కావచ్చునని కొందరి భావం. శ్రీ కృశ్చేవ్ తన పారిశ్రామిక ధ్యాజమాన్య సంస్కరణలను నిర్దుష్టంగా అమలు పరచడానికి ప్రభుత్వ యంత్రాంగాన్ని పూర్తిగా తిరగతోడతారని కొందరి నమ్మకము. త్వరలోనే కొత్త ఉప ప్రధానులుగా యెవరిని నియమిస్తున్నారో ప్రకటితం అవుతుంది.

మంత్రి మండలిలో ఈ ఉపప్రధానులందరూ చేరి అసలు అంతరంగిక మంత్రి మండలిగా వ్యవహరించడం ఆ దేశంలో మామూలు.

ఇవాళ మాస్కోలో రాయబార వర్గాలలో విశేషముగా రాకపోకలూ కలుసుకోడాలూ కనపడుతున్నాయి.

సోమనాగం నాడు జెకొస్లావాకియా వెళ్ళనున్న శ్రీ కృశ్చేవ్ నుఇవాళ యుగోస్లావ్ రాయబారి కలుసుకున్నారు.

యుగోస్లావియా ఉపాధ్యక్షులిద్దరూ త్వరలో రష్యా రానున్నారని బెల్‌గ్రేడ్‌లో ఒకరు చెప్పారు.

ఇవాళ కమ్యూనిస్టుపార్టీ కేంద్రసంఘ కార్యాలయంముందు, రష్యన్ కార్ల మధ్య జెకోస్లావాక్ రాయబారి కారు కనపడింది.

హంగరీ అధ్యక్షుడు శ్రీ ఇస్త్వాన్ డోబీ, ప్రధాని శ్రీ కాదార్ శెలవికి సెలవుతీసుకుని విశ్రాంతి తీసుకుంటున్నారని బుడాపెస్టులో ఒక ప్రకటన వెలువడింది. దీనికీ శ్రీ కృశ్చేవ్ ప్రాగ్ నగర సందర్శనానికీ ఏదో సంబంధం ఉందని కొందరి అభిప్రాయం.

## దేవాలయాల్లో నగకట్టు

### విలువ తేల్చేందుకు ప్రత్యేక సిబ్బంది

హైదరాబాదు, జులై 6: దేవాలయాల్లోని నగకట్టు విలువ అంచనా కట్టేందుకు, ప్రభుత్వం ప్రత్యేకసిబ్బందిని నియమించింది, యీ సిబ్బంది తమ పని ఇంకా పూర్తిచేయలేదని, దేవాదాయ ధర్మాదాయసంస్థల మంత్రి శ్రీ గ్రంధి వెంకటరెడ్డినాయుడు ఇవాళ శాసనసభలో చెప్పారు.

ఒక సంవత్సరంపాటు యీ సిబ్బందిని ప్రభుత్వం నియమించింది. వీరి గడువు యీ సంవత్సరం ఫిబ్రవరితో తీరిపోయింది. కాని పనిమాత్రం ఇంకా పూర్తికాలేదు. రు 10 వేల విలువకు మించి నగలున్న దేవాలయాల సంగతే, యీ సిబ్బంది చూస్తున్నారు.

మరో మూడు నెలలపాటు, యీ సిబ్బందికి గడువు పెంచవలసిందిగా మతాదాయసంస్థల కమీషనర్ కోరారని, ఆ విషయం ఇప్పుడు ప్రభుత్వం ఆలోచిస్తున్నదని, శ్రీ వెంకటరెడ్డినాయుడు తెలియజేశారు.

## అణ్వస్త్ర వినియోగం ఉండదని హామీ?

### 'ఆత్మరక్షణావసరం' మినహా అమెరికా ఒప్పుకోలు

లండన్, జూలై 5: అణ్వస్త్రాలను పూర్తిగా నిషేధించాలని రష్యా చేసిన సూచనను అమెరికా నిరాకరిస్తున్నదనీ, సమితి 51 వ నిబంధన ప్రకారం ఆత్మరక్షణావసరాన్ని మినహాయిస్తే, ఇతరత్రా ఆ అస్త్రాలను ప్రయోగించరని మాత్రం ఒప్పందానికి సమ్మతించగలరనీ, ఇవాళ సమితి నిరాయుధీకరణ ఉపసంఘంలో అమెరికా ప్రతినిధి శ్రీ హెరాల్డు స్టాసెన్ ప్రకటించారు.

నిరాయుధీకరణ మొదటి దశ ఒప్పందం గురించి అమెరికన్ ప్రతిపాదనలను ఉపసంఘంలో వివరించే కార్యక్రమం ఇవాళ పూర్తయింది.

శ్రీ స్టాసెన్ నేడు చేసిన ప్రకటనకు అర్థం, అణ్వస్త్రాలను పూర్తిగా నిషేధించాలని రష్యాచేసిన ప్రతిపాదనను అమెరికా పూర్తిగా నిరాకరించినట్లే, అని పరిశీలకులు చెపుతున్నారు.

[అణ్వస్త్రాలను ఏ పరిస్థితులలోనూ ప్రయోగించబోరని రష్యా, అమెరికా, బ్రిటన్‌లు ప్రతిజ్ఞచేయాలని ఇటీవల రష్యా ప్రతిపాదించింది.]

శ్రీ స్టాసెన్, రష్యా ప్రతిపాదన అమెరికాకు సమ్మతంకాదని ఉపసంఘంలో ప్రకటిస్తూ, సమితి నిబంధనలను అతిక్రమించని ఏ రాజ్యంపైనా అణ్వస్త్రాలను అమెరికా ఎన్నడూ ప్రయోగించదని స్పష్టపరిచారు. కావలసివస్తే ఈ విధంగా ఒప్పందంలో ఒకవాక్యం చేర్చడానికి అమెరికా సిద్ధంగా వుందని కూడా చెప్పారు.

### అమెరికా ప్రతిపాదనలు

అణ్వస్త్ర ఉత్పత్తికి అవసరమైన సామగ్రిపై అదుపుకు శ్రీ స్టాసెన్ ఇవాళ అమెరికన్ ప్రతిపాదనలను తెలియపరిచారు.

దీనితో వారి ప్రతిపాదనల వివరణ పూర్తి అయింది.

ఈ ప్రతిపాదనలలో కీలక ముఖ్యాంశాలు ఇవి:

పది మాసాలపాటు అణ్వస్త్ర పరీక్షల నిలుపుదల; ఆ తరువాత అంతర్జాతీయంగా ఏర్పాటుచేసే తనిఖీలో అదుపులకు లోబడి, అణ్వస్త్ర నిర్మాణాన్ని ఆపుచెయ్యాలి; అపైన అణ్వస్త్ర ఉత్పత్తి సామగ్రిని శాంతికాలపు కార్యక్రమావసరాలకు తరలించాలి.

అమెరికా ప్రతిపాదనల అంతర్యం, అణ్వస్త్రాలను విడదీచేసి, ఆ సామగ్రిని శాంతి అవసరాలకు మళ్లించాలనే, అని అమెరికన్ అధికారి ఒకరు వివరించారు.

అంతర్జాతీయ తనిఖీ కేంద్రాలకు ఈ సామగ్రిని అప్పగించినంత మాత్రంలో, దానిపై అప్పగించిన రాజ్యం హక్కు పోదుట, అది వారిపేరనే ఉంటుంది.

అయితే అణ్వస్త్రాలను ఎలా ప్రయోగించాలో ఇతర రాజ్యాల సైన్యాలకు శిక్షణ ఇచ్చే హక్కు అమెరికాకు ఉంటుంది కాని పోదు.

అమెరికా ఇతరదేశాల్లో అణ్వస్త్రాలను నిలవ ఉంచే హక్కు కూడా పోగొట్టుకోదు. అయితే వానిని అన్యాక్రాంతం చెయ్యదు. అవి యితర దేశాలలో ఉన్నప్పటికీ, అవి అమెరికాకు చెందినవే అవుతాయి.

అణ్వస్త్ర పరీక్షలను నిషేధించడం సమ్మతం కాని పక్షంలో, అణ్వస్త్రాలనే పూర్తిగా నిషేధించి, వీనిని యుద్ధములో ప్రయోగించరని రష్యా అమెరికా బ్రిటన్‌లు ప్రతిజ్ఞ తీసుకోవాలని రష్యా ప్రతిపాదించి ఉంది.

ఇప్పుడు శ్రీ స్టాసెన్ నిరాకరించినది ఈ సూచనను మాత్రమే అని కొందరు పరిశీలకులు అంటున్నారు.

అయితే సమితి 51 వ నిబంధన ప్రకారమే అణ్వస్త్రాలను ఉపయోగించగలరని మరలను ఒప్పుకొంటూ ఒప్పందంలో ఒకవాక్యం చేర్చడానికి అమెరికా సమ్మతిస్తుందిట.

ఈ 51 వ నిబంధన దురాక్రమణ జరిగినప్పుడు ఆత్మరక్షణార్థం యుద్ధం చేయడానికి గల హక్కులను వివరించేది.

రష్యా ప్రతినిధి శ్రీ వాలేరియన్ జోరిన్ ఈ ప్రతిపాదనలను జాగ్రత్తగా పరిశీలించి త్వరలోనే తమ అభిప్రాయాలు తెలపగలరని చెప్పారట.

బ్రిటిషు, కెనేడియన్ ప్రతినిధులు అమెరికన్ ప్రతిపాదనలు బలపరిచారట.

ఫ్రెంచి ప్రతినిధి శ్రీ జూల్స్ మాచ్ కూడా బలపరుస్తూ, తనిఖీ కేంద్రాలు నెలకొల్పడానికి అయ్యే వ్యయంకాదని చెప్పారట.

తనిఖీ చెయ్యవలసిన అణుశక్తికర్మాగారాలు, ప్రపంచమంతటా మొత్తం నూరుకంటె తక్కువే ఉంటాయనివారన్నారు.

సమితి నిరాయుధీకరణ ఉపసంఘం ఇవాళ రెండుపూటలా సమావేశమైంది. తిరిగి సోమవారంనాడు సమావేశమౌతుంది.

### అమెరికాలో అణ్వస్త్రప్రేలుడు

నెవడా, జూలై 6: ఇక్కడ నేడు మరొక అణ్వస్త్రాన్ని అమెరికా ప్రేల్చింది. ఇదివరకూ ఇంత శక్తివంతమైన అస్త్రాన్ని ప్రేల్చలేదు. దీనిని మొన్ననే ప్రేల్చవలసింది కాని వాతావరణం అనుకూలంగా లేకపోవడంవల్ల వాయిదా వేశారు.

ప్రేలుడు జరిగిన ప్రదేశానికి 5700 గజాల దూరంలో సుమారు నాలుగు వందలమంది సైనిక పరిశీలకులు, రెండు వేలమంది సాకొవిధానికి సంబంధించిన వారు కందకాలలో ఉన్నారు.

### ఉప మంత్రి శ్రీ కృష్ణప్ప

న్యూఢిల్లీ జులై 6: ఆహారశాఖ ఉప మంత్రి శ్రీ యం. వి. కృష్ణప్ప ఇకనుంచి వ్యవసాయశాఖ ఉప మంత్రిగా వ్యవహరిస్తారని, ప్రభుత్వం ప్రకటించింది.

## స్టెర్లింగు నిల్వల వాడకం

### మీనన్ సమర్థన: దేశాభివృద్ధికోసం వాటిని వాడుకోక తప్పదని స్పష్టీకరణ

లండన్, జులై 6: స్టెర్లింగు నిల్వలను భారతదేశం మించి వాడుతోందని బ్రిటన్‌లో బయలుదేరిన ప్రచారాన్ని భారతరక్షణ మంత్రి శ్రీ మీనన్ ఖండించారు.

యుద్ధానంతరం బ్రిటన్ చిక్కుల్లో వున్నపుడు మేము చాలా జాగ్రత్తగా వుండి, ఒకరిని నొప్పించకుండా వ్యవహరించాము. 'ఇప్పుడు మాకు పెట్టుబడి కావాలి. అది లేకపోతే, పని జరగని స్థితి ఇప్పుడు ఏర్పడింది. అందుచేత మా డబ్బును మేము పెట్టుబడికిగాను వాడుకుంటున్నాము అని భారతదేశం విధానాన్ని శ్రీ మీనన్ సమర్థించారు.

శ్రీ మీనన్ నేడు, మలయా విద్యార్థుల సభలో మాట్లాడారు. ఒక విద్యార్థి, భారతదేశం అమెరికానుంచి సహాయం పొందడానికి వీలుగా, తన విదేశాంగ విధానాన్ని మార్చుకుంటుందా అని ప్రశ్నించాడు. శ్రీ మీనన్ "అటువంటిదేమీ జరగదు" అని సమాధానం చెప్పారు.

మలయా మనిలా సంధిలో చేరడం మంచిదా అన్న ప్రశ్నకూడా వచ్చింది. శ్రీ మీనన్ అది మంచిది కాదన్నారు. "ఈ కూటాలు, ఇవ్వి, ఇంకోరూపంలో వలసపద్ధతిని తెచ్చిపెడతాయి" అని చెప్పారు. ఇప్పుడు కొత్తగా స్వాతంత్ర్యాన్ని పొందిన దేశాలు, పొందుతున్న దేశాలు, ఇటువంటి నవవలస తత్వాలకు తలఒగ్గడం మంచిదికాదని హెచ్చరించారు.

భారత దేశాన్ని గూర్చి మాట్లాడుతూ శ్రీ మీనన్ ఈ సభలో ఇట్లా చెప్పారు. "భారతదేశానికి 7 వేల సంవత్సరాల చరిత్ర వుంది. అయితే అందులో జరిగిన 10 సంవత్సరాల నుంచే, ఆ దేశం నిజమైన స్వాతంత్ర్యాన్ని, ప్రజాస్వామ్యాన్ని అనుభవిస్తోంది.

"భారతదేశంలో 1960 లక్షలమంది ఓటర్లు వున్నారు. ఇంతమందికి ఓటు హక్కు వున్న దేశం, ప్రపంచంలో భారతదేశం ఒక్కటే. వీరంతా తమ అభివృద్ధిని ఆకాంక్షించి ఓటుచేస్తూ వుంటారు.

"భారత దేశంలో 25కోట్ల ఎకరాల నేల, సాగుకు పనికి వచ్చేది వుంది. 40 కోట్ల మంది ప్రజలు వున్నారు. ఎన్ని శాసనాలు చేసినా ఈ అంకెలు మారవు. సోషలిజం పట్టీలు తగిలించి ఇంద్రజాలం చేద్దామంటే కుదరదు. నీటి పారుదల సౌకర్యాలు బ్రహ్మాండంగా కల్పించాలి. అప్పుడు ప్రజలకు మేలు చేసినట్లవుతుంది.

"ఇందుకు ఏ పని జరగాలన్నా డబ్బు కావాలి. బ్రిటిష్‌వారి హయాంలో ప్రభుత్వం మొత్తం ఆదాయం 9 కోట్ల పౌనులకు మించి వుండేది. ఇప్పుడు భారత ద్వితీయ ప్రణాళిక ఖర్చులకే 8వందలు, 4వందలు కోట్ల పౌనులు కావలసి వుంది. అందుచేత, స్టెర్లింగు నిల్వలను భారతదేశం వాడేసుకుంటోందని బ్రిటిష్ పత్రికలు గోల చేసి లాభం లేదు.

"భారతదేశంలో అభివృద్ధిని సాధించడమే మా ధ్యేయం. అందుకు ఏది మంచిదో అది చేస్తాము. భారతదేశాంగ విధానం సంగతి కూడా అంతే. మాకు ఏ విధానాన్ని అనుసరించడం క్షేమమో, దాన్ని అనుసరిస్తాము.

# గోవా విముక్తి పంచశీలకంటే ముఖ్యం

## జగన్నాధరావ్ జోషి అభిప్రాయం

వరంగల్లు, జూలై 3: పట్టణ జనసంఘ అధ్వర్యాన నిన్న బహిరంగసభ జరిగింది. శ్రీ చందా మార్కండేయ అధ్యక్షత వహించారు.

శ్రీ గోపాల్‌రావు శ్రీ జోషిని పరిచయంచేస్తూ గోవా విముక్తికి జరిగిన ఉద్యమంలో శ్రీ జోషి పాత్ర వివరించారు. జనసంఘ ఆశయాలు తెలిపారు. శ్రీ కె. యస్. రామచంద్రమూర్తి మాట్లాడుతూ పన్నుల భారాన్ని నిరసించారు. ఎంత పెచ్చించినా గ్రామాలు అలాగే వున్నవన్నారు.

శ్రీ జోషి ప్రసంగిస్తూ గోవావిముక్తి లక్ష్యమన్నారు. భారత ప్రభుత్వ అలక్ష్య వైఖరిని నిరసించారు. దేశాన్ని పూర్తిగా దాస్యవిముక్తం చేయకుండా గోవాలో అక్రమాలు చూస్తూ వూరుకుంటూ, పంచశీల, అంతర్జాతీయ ప్రతిష్ఠలకోసం ప్రాకులాడటం భావ్యం కాదన్నారు. సామ్యవాద సహకార శ్రేయోరాజ్యం, సమిష్టి ఆస్తి విధానం, మొదలగు పద్ధతుల గురించి అదేపనిగా చెప్పేకంటె త్వరలో శాంతంగా దేశ పునర్నిర్మాణం జరిగే విధానమే నేడు మనకు అవసరమన్నారు.

పాకిస్తాన్‌ను తిరిగి కలుపుకోవాలన్న జనసంఘ ఆశయం తప్పుకాదని, అక్కడి ముస్లింలకుకూడా ఇక్కడి ముస్లింలవలె సుఖశాంతులు ప్రసాదించడమే తమ లక్ష్యమని చెప్పారు.

# శ్రీ చోడగం జనార్దనరావు మృతి

మదరాసు, జూలై 6: కర్నూలులో ఎగ్జిక్యూటివు ఇంజనీరుగా పనిచేసిన శ్రీ చోడగం జనార్దనరావు నిన్న ఉదయం గుండెజబ్బుతో స్వర్గస్థులయ్యారని తెలియజేయటానికి విచారిస్తున్నాం. ఆరు వారాలకు పూర్వం వీరికి మొదటిసారి గుండెజబ్బు వచ్చింది. నయమై తగ్గిపోయిందనుకుంటూ వుండగా మరల తిరగబెట్టింది.

శ్రీ జనార్దనరావు స్నేహపాత్రులు, ఆయన మదరాసు నగరపాలక సంఘంలో చాలాకాలం అసిస్టెంటు ఇంజనీరుగా బహు సమర్ధతతో పనిచేశారు. తరువాత కేంద్ర ప్రభుత్వం ఆహ్వానంపై నూతన రాజధాని నిర్మాణానికిగాను చండీఘర్ వెళ్ళి అక్కడ మూడు సంవత్సరాలు పనిచేశారు.

ఆంధ్రరాష్ట్రం నిర్మాణం జరిగినప్పుడు కర్నూలులో రాజధానికి కావలసిన వసతులను సమకూర్చటంలో తోడ్పడ్డారు, ఆఖరు రోజుల్లో నాగార్జున సాగర్ ప్రాజక్టు నిర్మాణంలో ప్రత్యేకోద్యోగిగా నియమితులై పనిచేస్తూ వుండగా గుండెజబ్బు వచ్చింది. వీరికి ఒక కుమారుడు, ఒక కూతురు వున్నారు. ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ శాసనసభ సభ్యురాలు సమిష్టి మదరాసు రాష్ట్రంలో ఉప సభాపతిగా వుండిన శ్రీమతి అమ్మన్నరాజా వీరి సతీమణి. గ్రూప్ కాప్టెన్ శ్రీ సి. సత్యనారాయణ వీరికి సోదరులు.

శుక్రవారం సాయంత్రం 5-30 లకు ఎలియట్స్‌బీచ్ శ్మశానంలో అంత్యక్రియలు జరిగాయి. మరణవార్త తెలియగానే మదరాసు ముఖ్యమంత్రి శ్రీ కామరాజ నాడార్, మదరాసులో వారితో కలిసి పనిచేసిన ఉద్యోగులు, పలువురు మిత్రులు అడయార్‌లోని కింగ్ ఇన్‌స్టిట్యూట్ మాజీ డైరక్టరు డాక్టరు వై. యస్. నారాయణ ఇంటికి వెళ్ళి శ్రీమతి అమ్మన్న రాజాను పరామర్శించారు.

---

**ఆంధ్ర యూనివర్శిటీ టెండర్లు కావలెను**

ఆంధ్ర యూనివర్శిటీకి వాల్తేరు వందలి ఫార్మసీ డిపార్టుమెంటుకు 2వ అంతస్తు నిర్మించుటకు సీలు వేసిన టెండర్లు, రిజస్ట్రారు, ఆంధ్ర యూనివర్శిటీ, వాల్తేరువారికి 29-7-57 సోమవారం సా॥ 4 గం॥ల వరకు దాఖలు చేసికొనబడును. షెడ్యూల్సు, స్పెసిఫికేషనులు కావలసినవారు రిజస్ట్రారు వారికి ఫీజు ఖరీదు క్రింద రు. 25/- పంపి పొందవచ్చును.

టి. వి. ఎస్. ఎల్. నరసింహం,
అసిస్టెంటు రిజస్ట్రారు (అకౌంట్సు.)

---



# బహిరంగసభలలో మంత్రుల ప్రసంగాలు

## శాసనసభలో ఉదహరించే సమస్యపై సభాపతి ఆదేశం

హైదరాబాదు, జూలై 5: "బహిరంగసభలలోగాని, ఇతరత్రాగాని మంత్రులు చేసే ప్రసంగాలను శాసనసభలో సభ్యులు ఉటంకించరాదు" అని సభాపతి శ్రీ అయ్యదేవర కాళేశ్వరరావు ఇవాళ ఆదేశించారు.

ప్రతిపక్షాలకు చెందిన సభ్యుణ్ణి ఎన్నికలలో గెలిపించితే "మీ నియోజకవర్గంలో పనులు ఏమీ జరగవని" శ్రీ మనయ్య నియోజకవర్గంలో ఎన్నికల ప్రచారం సందర్భంలో ముఖ్యమంత్రి శ్రీ సంజీవరెడ్డి అన్నట్టు బడ్జెట్ పై చర్చ సందర్భంలో శ్రీ మనయ్య (స్వ) అనగా సభాపతి శ్రీ కాళేశ్వరరావు పైవిధంగా ఆదేశించారు. సభాపతి ఇంకా ఇట్లా అన్నారు: "శ్రీ మనయ్య చెప్పినట్లు తాను అనలేదని బహుశా ముఖ్యమంత్రి అంటారు. శ్రీ మనయ్య చెప్పిన మాటలను ముఖ్యమంత్రి అని ఉండక పోవచ్చు కనుక రుజువు చెయ్యలేని సంగతులు చెప్పవద్దని సభ్యులను కోరుతున్నాను. అయితే అటువంటి ప్రసంగాలు బాధ్యతగల పత్రికలలో వెలువడితే సభ్యులు వాటి ప్రస్తావన తీసుకురావచ్చు."

# గ్రామీణబ్యాంకుల రిజిస్ట్రేషన్ షరతులు

## వెనుకబడిన జిల్లాలకు కొన్ని సౌకర్యాలు

తిరుపతి, జూలై 4: రాయలసీమ ప్రాంతం వెనుకబడి వున్నందున, ఆర్థికంగా తగు స్తోమత లేనందున గ్రామీణ బ్యాంకుల రిజిస్ట్రేషన్ షరతులను సడలించాలని శ్రీ అనంతశయనం అయ్యంగారు రాష్ట్రప్రభుత్వానికి సూచించారు.

సహకార సంఘాల రిజిస్ట్రారు సమాధానం పంపుతూ వెనుకబడిన జిల్లాల విషయంలో ప్రమాణాలను సగానికి తగ్గించారని తెలిపారు. (స్వ. వి.)

# గ్రామీణబ్యాంకు ప్రారంభం

చిత్తూరు, జూలై 2: వాయల్పాడు తాలూకా కలికిరి గ్రామంలో బ్యాంకును మంత్రి శ్రీ తిమ్మారెడ్డి మొన్న ప్రారంభోత్సవం చేశారు. శ్రీ టి. యన్. విశ్వనాథరెడ్డి, అధ్యక్షత వహించారు. శ్రీ యన్. సి. రామిరెడ్డి స్వాగతమిచ్చారు. (స్వ. వి.)

# తరిమెలలో గ్రామీణ బ్యాంకు ప్రారంభం

అనంతపురం, జూలై 1: అనంతపురం తాలూకా తరిమెల గ్రామంలో నెలకొల్పిన గ్రామీణ సహకారబ్యాంకును రాష్ట్ర ప్రభుత్వ స్థానిక వ్యవహారాల శాఖ మంత్రి శ్రీ కాసు బ్రహ్మానందరెడ్డి జూన్ 29వ తేదీని ప్రారంభోత్సవం జరిపారు. గ్రామీణులు ఐకమత్యంతో కలిసి మెలసి పని చేస్తూ బ్యాంకు నెలకొల్పినందుకు వారిని అభినందిస్తూ, ఈ బ్యాంకు ప్రజల అభివృద్ధికి ఉపకరించగలదని ఆశిస్తున్నట్లు శ్రీ బ్రహ్మానందరెడ్డి చెప్పారు.

శాసనసభ్యుడు శ్రీ టి. రామచంద్రారెడ్డి స్వాగత వచనాలు పలికారు.

బ్యాంకు ప్రధాన వ్యవస్థాపకులు శ్రీ టి. రంగారెడ్డి ఆరంభంలోనే 35,000 రూపాయల మూలధనం కాక 12,000 రూపాయల డిపాజిట్లు కూడా సేకరించినట్లు చెప్పారు. ఇల్లూరు, గుమ్మేపల్లి, నిధనవాడ, రాచేపల్లి, అనందరావుపేట గ్రామాలలో కుటుంబానికి ఒక్కరిని అయినా సభ్యుడుగా చేర్చి బ్యాంకు తనకు ఉన్న నిధిలోనే ప్రజల అభివృద్ధికి తోడ్పడేటట్లు చేయడం తమ లక్ష్యమని కూడా ఆయన చెప్పారు.

పార్లమెంటు సభ్యుడు శ్రీ తరిమెల నాగిరెడ్డి, శాసనసభ్యులు శ్రీయుతులు కల్లూరు సుబ్బారావు, కె. వి. వేమారెడ్డి, పి. ఆంథోనిరెడ్డి ప్రభృతులు ఆ సందర్భంలో ప్రసంగించారు.

నూతనంగా ఏర్పడిన తరిమెల పంచాయతి తరఫున అధ్యక్షులు శ్రీ టి. రామచంద్రారెడ్డి మంత్రి శ్రీ బ్రహ్మానందరెడ్డికి సన్మానపత్రం సమర్పించారు. (స్వ. వి.)

# భద్రాచలం సహకార బ్యాంకు

భద్రాచలం, జూలై 3: సహకార అర్బన్ బ్యాంకు సర్వసభ్య సమావేశంలో ఈదిగువ సూచించినవారు డైరెక్టర్లుగా ఎన్నికైనారు: శ్రీయుతులు పందిరి రామిరెడ్డి, ఏలిశెట్టి నాగభూషణం, చలవాది నరసింహారావు, పి. లక్ష్మయ్య, బదుల రామచంద్రయ్య. (స్వ. వి.)

# ప్రొద్దుటూరు సహకార బ్యాంకు

ప్రొద్దుటూరు, జూలై 1: సహకార పట్టణబ్యాంకు సర్వసభ్య సమావేశం నిన్న జరిగింది. కార్యదర్శి శ్రీ వి సత్యనారాయణ నివేదికను ఆమోదించారు.

శ్రీయుతులు పొన్నాం చక్రమునిరెడ్డి రామిరెడ్డి, జి. సుబ్బారెడ్డి, శివరామయ్య, దస్తగిరి సాహెబ్, పి. పార్థసారథి, సుందూరావు. పాలకవర్గ సభ్యులుగా ఎన్నికైనారు.

# ఖైరతాబాద్ సికిందరాబాద్ లలో తపాలా ఏర్పాట్లు

హైదరాబాద్, జూలై 5: శీతజ్వరం కారణంగా సికిందరాబాద్ ప్రధాన తపాలా కార్యాలయం, ఖైరతాబాదు సబ్ పోస్టాఫీసులోని పనివారు చాలామంది కార్యాలయాలకు హాజరు కాలేకపోతున్నారు. అందువల్ల సికిందరాబాద్ తపాలా కార్యాలయం, ఖైరతాబాద్ సబ్ పోస్టాఫీసులకు సంబంధించిన తపాలాపెట్టెలలోని జాబులూ, బంగీలవంటి వాటిని ఇప్పటి మాదిరి రోజుకు4 సార్లు కాక 2 సార్లుమాత్రమే తీస్తారు. ఈ ఏర్పాటు ఇవాల్టి నుంచీ అమలులోకి వచ్చింది.

అవసరంగా బట్వాడా కావలసిన జాబులూ, బంగీలవంటి వాటిని పంపించేందుకు సికిందరాబాద్ ప్రధాన తపాలా కార్యాలయంలోని తపాలా పెట్టెలనూ, కింగ్స్‌వేలోని "పార్కింగ్" కేంద్రంలోని తపాలా పెట్టెలనూ, ఖైరతాబాద్ సబ్ పోస్టాఫీసులోని తపాలాపెట్టెలను వినియోగించుకోవలసినదిగా తపాలా శాఖ విజ్ఞప్తిచేస్తోంది. ఈ కార్యాలయాలలోని తపాలా పెట్టెలలో నుంచి మామూలుగా జాబులనూ, బంగీలనూ తీసే ఏర్పాట్లు జరిగినవి.

# ఇచ్ఛాపురం రైలు స్టేషనులో చోరీ

## ముగ్గురిని నిర్బంధం

శ్రీకాకుళం, జూలై 2: గతనెల 26వ తేదీన ఇచ్ఛాపురం రైలు స్టేషనులో టిక్కెట్లు ఇచ్చే గుమాస్తా రు 900 లెక్కపెట్టి, కట్టకు సీలువెయ్యటానికని గదిలో మరోకచోట ఉన్న బీరువాదగ్గరకు వెళ్ళి సరికి బల్లమీద ఉంచిన ఆ కట్ట మటుమాయమైంది.

వెంటనే ప్రక్కనున్న రైలుస్టేషన్లకు ఈ వార్తను తంతి ద్వారా తెలియచేయగా సోంపేటలో పోలీసులు ముగ్గురు వ్యక్తులను నిర్బంధించి వారిదగ్గర లభించిన రు 900 నోట్లను వశపరుచుకున్నారు. ఇచ్ఛాపురం రైలుస్టేషనులో పోయిన నోట్ల నెంబర్లు, ఈనోట్ల నెంబర్లు సరిపోయాయి. (స్వ.వి.)

# పంచాయతీ కార్యాలయంలో దొంగతనం

ఏలేశ్వరం, జూలై 1: స్థానిక పంచాయతి కార్యాలయంలో క్రిందటి శనివారం రాత్రి దొంగలు ప్రవేశించి పంచాయతి రికార్డులు, గ్రంథాలయంలో పుస్తకాలు, ఎత్తుకొనిపోయారు. కార్యాలయ సిబ్బందికి ఇవ్వడానికిసిద్ధంగా ఉంచిన 200 రూపాయల విలువ కలిగిన బట్టలు, గడియారం, డబ్బు దొంగలు ముట్టుకొనలేదు.

ఈ చిత్రమైన దొంగతనం గురించి గ్రామంలో పలువిధాలుగా చెప్పుకుంటున్నారు.

పంచాయతి అధికారులు ఫిర్యాదు చేయగా పోలీసులు దర్యాప్తు ప్రారంభించారు. (స్వ. వి.)

**కృష్ణానది నీటిమట్టం**

విజయవాడ, జూన్ 29: ఈరోజున కృష్ణానదిలో సేతు ఆనకట్టపై 7 అడుగుల ఎత్తున ప్రవహిస్తోంది.

# ప్రణాళికకోసం క్రొత్త పన్నులు అవసరం

## మిస్సుల సూర్యనారాయణమూర్తి వినతి

అనకాపల్లి, జూలై 2: ద్వితీయ పంచవర్ష ప్రణాళిక నిర్వహణకోసం భారత ప్రభుత్వం క్రొత్తపన్నులను విధించక తప్పలేదనీ, అయితే ఈ పన్నుల భారం పేదలపై ఎక్కువగా పడనందున ప్రజలు వీటిని సమర్థించాలనీ పార్లమెంటు సభ్యుడు శ్రీ మిస్సుల సూర్యనారాయణ మూర్తి ఇక్కడ ఒక బహిరంగసభలో ప్రసంగిస్తూ విజ్ఞప్తిచేశారు.

సభకు శ్రీ గ్రంథి కన్నయ్య పంతులు అధ్యక్షత వహించారు.

ప్రభుత్వం మొదట కాఫీ, టీ, కిరసనాయిలు, తపాలా కార్డులపై అదనంగా పన్నులు విధించికూడా తిరువాతవాటిని రద్దుపరచిందనీ, ఇందుకు కారణం పార్లమెంటరీ కాంగ్రెసు పక్షం, సమావేశంలో పేదలపై పన్నుల భారం ఎక్కువగా పడరాదని, నిర్ణయించటమేననీ శ్రీ సూర్యనారాయణమూర్తి వివరించారు. (స్వ. వి.)

# నాలుగు రోజులలో మైలు రోడ్డు నిర్మాణం

## రెడ్డివారిపల్లె గ్రామస్థుల కృషి

మదనపల్లె, జూలై 1: రెడ్డివారిపల్లె గ్రామంలో నిర్వహించిన గ్రామ నాయక శిక్షణశిబిర విద్యార్థులు, అధికారులు, అనధికారులు, గ్రామస్థులు స్వయంకృషితో 4 రోజులలో నిర్మించిన మైలు 2 ఫర్లాంగుల పొడవురోడ్డును మంత్రి శ్రీ తిమ్మారెడ్డి ప్రారంభం చేశారు. సభకు శ్రీ బి. కె. రామారావు అధ్యక్షత వహించారు.

శ్రీమతి సీతాలక్ష్మమ్మ నివేదిక చదివారు. శ్రీ తిమ్మారెడ్డి మాట్లాడుతూ గ్రామస్థుల కార్యదీక్షను ప్రశంసించారు. బ్లాక్ అధికారి శ్రీ ఆర్. జి. నారాయణరాజు ప్రజలలో చేస్తున్న ప్రచారానికి మార్గం వెలిబుచ్చారు. ప్రజలు కష్టపడి త్యాగాలు చేస్తేగాని దేశం అభివృద్ధి చెందదని ప్రభుత్వ మిస్తున్న సహాయ సౌకర్యాలను ప్రజలు సరిగా వినియోగించుకోవాలని కోరారు. ఆచార్య భావే, ఉద్యమానికి సహకరించాలని విజ్ఞప్తిచేశారు.

బి. కె. రామారావు అమితాపల్లి సుబ్బయ్య గారలు మాట్లాడారు. మంత్రి బహుమతులు పంచారు. శ్రీ టి. వెంకటరెడ్డి వందనమర్పించారు. నాటక ప్రదర్శనములు జరిగినవి.

# తిరుపతి వరకూ బ్రాడ్‌గేజి

## అనంతశయనం సూచన

తిరుపతి, జూలై 4: తిరుత్తణి, కాళహస్తి క్షేత్రాలకువెళ్ళే తిరుపతియాత్రికుల సౌకర్యార్థం రేణిగుంటవరకు ఇప్పుడు వేస్తున్న బ్రాడ్ గేజి మార్గాన్ని తిరుపతి వరకు పొడిగించాలని విహారకేంద్రాల సౌకర్యాలకు తిరుపతికికూడా వర్తింప చేయాలని తంతితపాలాశాఖ మంత్రి రాజబహదూర్‌కు లోక్‌సభ సభాపతి శ్రీ అనంతశయనం అయ్యంగారు సూచించారు.

శ్రీ రాజబహదూర్ తిరుమలైకు నిన్నవచ్చారు. శ్రీ దేవరాజ్ స్వాగతమిచ్చారు. శ్రీ రాజబహదూర్ శ్రీ వెంకటేశ్వరస్వామికి పూజలు జరిపారు.

తరువాత విశేషులలో శ్రీ రాజబహదూర్ ప్రసంగిస్తూ మనదేశానికి విహారార్థంవచ్చే విదేశీయాత్రికులు చాలా తక్కువమందేనని ఇంతేకాక, దక్షిణ, ఉత్తర, భారతాలమధ్య స్నేహ సంబంధాలు ఇంకా దృఢతరం చేయడానికి, ఒకరినొకరు బాగా అర్థంచేసుకోవడానికి తగుదు పుణ్యక్షేత్రాల, చరిత్రాత్మకస్థలాల సందర్శనను ప్రోత్సహించడం మంచిదని తమఅభిప్రాయం వెల్లడించారు. ఈక్షేత్రాల విషయమై ఉభయప్రాంతాలలోను బాగాప్రచారంజరగాలని సూచించారు. తిరుమలైను ఆకర్షణీయంగా వుంచుతున్నందుకు దేవస్థానమును ప్రశంసించారు.

# స్థానికసంస్థల సిబ్బంది అక్కౌంట్ పరీక్షా ఫలితాలు

కర్నూలు, జూలై 2: ఏప్రెల్‌లో స్థానికసంస్థల సిబ్బందికి నిర్వహించిన "అక్కౌంట్" పరీక్షలలో దిగువ క్రమసంఖ్యలుగల అభ్యర్థులు ఉత్తీర్ణులైనారు.

**ప్రథమశ్రేణి**

ఎవ్వరూ ఉత్తీర్ణులు కాలేదు.

ద్వితీయశ్రేణి: 1 2 8 9 14 16 17 21 27 32 35 36 37 43 47 49 52 56 63 65 67 70 72 75 82 84 85 95 98 104 112 114 115 116 119 122 123 126 130 132 137 138 140 142 148 152 154.

144 క్రమసంఖ్య ఫలితం నిలిపివుంచారు.

# రేపల్లె తాలూకా పంచాయతి అధ్యక్షులు

రేపల్లె, జూలై 3: రేపల్లె తాలూకా పంచాయతి అధ్యక్షుల సంఘం ఈ నెల 10వ తేదిని ఇక్కడ సమావేశమై కార్యనిర్వాహక వర్గాన్ని ఎన్నుకొంటుందని అధ్యక్షులు శ్రీ చిటిమోతు రాఘవయ్య తెలియపరచుతున్నారు.

# హైద్రాబాదులో శీతజ్వరం

హైదరాబాదు, జూలై 5: హైద్రాబాదులో ఇవాళ్ళ 962 మందికి శీతజ్వరం తగిలింది. నగరంలోని వివిధఆసుపత్రులలోనూ 63 గురిని చేర్చారు; 68 మంది రోగులు చికిత్స పూర్తయి విడుదలయినారు.

బందరులోని విద్యాసంస్థలను ఈనెల 10వ తేదీదాకా తెరవవద్దని కృష్ణాజిల్లా కలెక్టరు ఉత్తరువులు జారీచేసినట్లు ఇక్కడికి వార్తలు వచ్చినవి. లోగడ చేసిన నిర్ణయంప్రకారం బందరులోని విద్యాసంస్థలను ఇవాల్టి నుంచీ తెరవవలసి ఉన్నది.

కొత్తగూడెంలో నిన్న కొత్తగా 500 మందికి శీతజ్వరం తగిలిందని వార్తలు వచ్చినవి. అక్కడి పాఠశాలలను నిన్న తెరిచారు. కానీ, మళ్ళీ ఓ వారం రోజులపాటు మూసివేయ వలసిందిగా ఇప్పుడు ఉత్తరువులిచ్చారు. అక్కడి బొగ్గుగనులు చాలా తక్కువ మంది ఉద్యోగులతో పనిచేస్తున్నవి.

శీతజ్వరం వ్యాప్తిని నిరోధించేందుకని హైదరాబాదు, సికిందరాబాదు జంట నగరాలలోని కళాశాలలనూ, పాఠశాలలనూ ఈ నెల 15 దాకా తెరవవద్దని ఆదేశించారు. శీతజ్వరం కారణంగా జంటనగరాలలోని విద్యాసంస్థల పునః ప్రారంభం దాదాపు ఒక నెల దాకా వాయిదాపడింది.

సినిమా ప్రదర్శనశాలల్లో పొద్దుటిపూట ఆటలూ, పగటిఆటలపై నిషేధం కూడా ఈనెల 15 దాకా అమలులో ఉంటుంది.

## నల్లగొండలో శీతజ్వరం

హైదరాబాదు, జూలై 5: శీతజ్వరం కారణంగా నల్లగొండలోని పాఠశాలలనూ, నాగార్జున కళాశాలనూ ఈనెల 19వ తేదీదాకా పునఃప్రారంభించవద్దని ఉత్తరువులు జారీఅయినవి. ఈనెల19 నుంచి ఈ విద్యాసంస్థలను తెరుస్తారు.

## కొత్తగూడెంలో శీతజ్వర నిరోధ చర్యలు

కొత్తగూడెం, జులై 2: పట్టణంలో శీతజ్వరం ఉధృతంగా వున్నది. మొన్న సాయంత్రం వరకు 2016 మందికి గనుల ఆస్పత్రిలో మందు లిచ్చారు. ఇందులో 247 మంది ఆస్పత్రిలో చేరారు. 170 మందిని చికిత్సానంతరం పంపివేశారు. వైద్యులకు, నర్సులకు, కూడా యీ వ్యాధి సోకింది. అయితే రోగులలో ఎవరూ చనిపోలేదు.

నేటినుంచి తగు మందులతో, పరికరాలతో ఒక సంచార వైద్యదళాన్ని ఏర్పాటుచేశారు. వ్యాధి నిరోధానికి తగు ప్రచారం చేస్తున్నామని గనుల ఆస్పత్రి వైద్యాధికారి శ్రీ టి. వి. రామచంద్రాని చెప్పారు.

## శీతజ్వర బాధితులకు సహాయంచేసే కృషి

హైదరాబాదు, జులై 4: హైదరాబాదు,సికిందరాబాదు జంటనగరాలలో శీతజ్వరాన్ని నిరోధించేందుకు-అవసరమైన మందులను విరాళంగా సేకరించాలని మందుల వ్యాపారస్థుల సంఘ పాలకవర్గం నిర్ణయించింది. ఇట్లా సేకరించే మందులను ఉచితంగా రోగులకు చికిత్సచేసే వారికి ఇస్తారు. కనుక మందులను విరివిగా ఉచితంగా ఇవ్వవలసినదిగా మందులను తయారుచేసే సంస్థలకు మందుల వర్తకులసంఘం కార్యదర్శి శ్రీ ఆర్. గాంధీ విజ్ఞప్తి చేస్తున్నారు. మందులు కొనడానికి విరాళాలు ఇవ్వదలచినవారు మందుల వ్యాపారస్థుల సంఘం కార్యదర్శి-హనుమాన్ మెడ్కో - హైదరాబాదు అనే చిరునామాకు పంపించవచ్చు.

## హైదరాబాదులోబ్యాంకుల పని గంటల తగ్గింపు

హైదరాబాదు, జూలై 5: శీతజ్వరం కారణంగా హైదరాబాదు, సికిందరాబాదు జంటనగరాలలోని బ్యాంకులు ఇవాల్టి నుంచి (ఈ నెల 5వ తేదీ) ఉదయం పదిన్నరనుంచి మధ్యాహ్నం ఒంటిగంటవరకూ పనిచేస్తున్నవి. శనివారాలలో మాత్రం మామూలుగానే పనిచేస్తవి.

## ఖమ్మం ఉత్సవాల వాయిదా

ఖమ్మంమెట్టు, జూలై 3: ఖమ్మం పట్టణంలో శీతజ్వరం ఎక్కువగా ఉన్నందువల్ల, ఈ వారాంతంలో ఇక్కడ జరగవలసిన శ్రీమద్రామాయణ కల్పవృక్షం పూజా సన్మాన మహోత్సవాలు వాయిదా పడినవి. శ్రీమద్రామాయణ కల్పవృక్ష కృతికర్త కవిసమ్రాట్ శ్రీ విశ్వనాథ సత్యనారాయణగారి ఉపన్యాసాలు కూడా యీ ఉత్సవాలలో యేర్పాటు చేయాలని నిర్వాహకులు అనుకున్నారు. ఆగస్టు నెలలో వీటిని నిర్వహించాలని ప్రస్తుతం నిర్ణయమైంది. మంత్రి శ్రీ గోపాలరెడ్డి తదితర సాహితీవేత్తలనూ యీ ఉత్సవాలకు ఆహ్వానిస్తారు. (స్వ. వి.)

## ఒంగోలులో పాఠశాలల మూసివేత

ఒంగోలు, జూలై 5: శీతజ్వరం తీవ్రంగా వ్యాపించిన కారణంచేత పురపాలక సంఘ యాజమాన్యం క్రింద ఉన్న ప్రాథమిక పాఠశాలలు అన్నీ ఒక వారం రోజులపాటు మూసివేయడానికి కమిషనరు శ్రీ ఎస్. పి. రంగనాయకులునాయుడు ఉత్తర్వుచేశారు.

క్రీడారంగం:

# వింబుల్డన్ ఫైనల్‌లో కూపర్‌పై హోడ్ గెలుపు

## కుమారి గిబ్సన్, కుమారి హార్ట్ మూడు ఫైనల్స్‌లో ప్రవేశం

లండన్, జూలై 5: వింబుల్డన్ లాన్ టెన్నిస్ ఛాంపియన్ షిప్స్ సింగిల్స్ ఫైనల్‌లో ఆస్ట్రేలియా ఆటగాడు ఎల్. ఎ. హోడ్ ఈ ఏడాది కూడా గెలుపొందాడు. హోడ్ ఈ రోజున అవలీలగా ఎ. జె. కూపర్ (ఆస్ట్రేలియా)ను ఓడించారు. స్కోరు: 6-2, 6-1, 6-2.

హోడ్ క్రిందటి ఏడాది మొదటి పర్యాయం వింబుల్డన్ ఛాంపియన్ షిప్ గెలుపొందాడు. ద్వితీయ ప్రపంచ సంగ్రామం ముగిసిన తరువాత ఈ ఛాంపియన్ షిప్ రెండు పర్యాయాలు గెలుపొందిన ఆటగాడు హోడ్.

80 సంవత్సరాలుగా వింబుల్డన్ టూర్నమెంటు చరిత్రలో వరుసగా రెండు సంవత్సరాలు ఛాంపియన్ షిప్ గెలుపొందిన మొదటి ఆస్ట్రేలియా ఆటగాడు కూడా అతడే.

పురుషుల డబుల్స్ సెమి ఫైనల్‌లో జి. ముల్లాయ్, బి. పాటి (సంయుక్త రాష్ట్రాలు) 9-7, 7-5, 6-3 స్కోరుతో ఆర్. బెక్కర్ (బ్రిటన్), ఆర్. ఎన్. హో (ఆస్ట్రేలియా) లను ఓడించారు. ఫైనల్‌లో ముల్లాయ్, పాటి ఆస్ట్రేలియాజట్టుహోడ్, ఫ్రేజర్‌లతో పోటీ చేస్తారు.

కుమారి ఆల్తీ గిబ్సన్, కుమారి డి. ఆర్. హార్ట్ (అమెరికా) మూడు ఫైనల్స్‌లో ప్రవేశించారు. గిబ్సన్ హార్ట్‌లకు రేపు స్త్రీల సింగిల్స్ ఫైనల్‌లో పోటీ జరుగుతుంది.

కుమారి గిబ్సన్, కుమారి హార్ట్ ఈ రోజున స్త్రీల డబుల్స్ సెమి ఫైనల్‌లో 6-2, 6-2 స్కోరుతో కుమారి ఎస్. రేనాల్డ్సు, కుమారి ఆర్. షూ ర్మాన్ (దక్షిణాఫ్రికా) లను ఓడించారు.

మిక్స్‌డ్ డబుల్స్ సెమి ఫైనల్‌లో ఎమ్. జి. రోజ్ (ఆస్ట్రేలియా), కుమారి డి. ఆర్. హార్ట్ (సంయుక్త రాష్ట్రాలు) 8-6, 6-8, 8-3 స్కోరుతో ఎల్. అయాలా (చిలి), శ్రీమతి టి. డి. లాంగ్ (ఆస్ట్రేలియా) లను ఓడించారు.

మిక్స్‌డ్ డబుల్స్ క్వార్టర్ ఫైనల్స్ ఫలితాలు ఈ క్రిందివిధంగా ఉన్నవి: ఎల్. అయాలా, శ్రీమతి టి. డి. లాంగ్ 6-1, 6-2 స్కోరుతో ఎ.ఆర్. మిల్స్, కుమారి ఆర్. జె. బెంట్లీ (బ్రిటన్) లను ఓడించారు. ఫ్రేజర్ (ఆస్ట్రేలియా), కుమారి గిబ్సన్ (సంయుక్త రాష్ట్రాలు) 10-8, 9-7 స్కోరుతో నరేష్ కుమార్ (భారతదేశం), కుమారి ఇ. బూడింగ్ (జర్మనీ) లను ఓడించారు.

# మూడవ టెస్టు

## ఇంగ్లండ్ 6 వికెట్లకు 619 పరుగులు

నాటింగ్‌హామ్, జూలై 5: మూడవ క్రికెట్ టెస్ట్ రెండవరోజు ఆటలో నేడు టీ వేళకు 6 వికెట్ల నష్టానికి 619 పరుగులుచేసి తమ మొదటి ఇన్నింగ్సు సమాప్తమయినట్లు ఇంగ్లండు జట్టు ప్రకటించారు. ఆతరువాత బాటింగు ప్రారంభించి వెస్ట్ ఇండీస్ జట్టుమొదటి ఇన్నింగ్సులో సాయంకాలం ఆట ముగిసే సమయానికి వికెట్ నష్టంలేకుండా 59 పరుగులు చేశారు.

ఇంగ్లండ్ మొదటి ఇన్నింగ్సులో పి. ఇ. రిఛర్డ్‌సన్ 126 పరుగులు, టి. డబ్ల్యు. గ్రావ్‌నే 258 పరుగులు, కాప్టెన్ పి. బి. హెచ్. మే 104 పరుగులు, డి. డబ్ల్యు. రిఛర్డ్‌సన్ 33 పరుగులు చేశారు.

వెస్ట్ ఇండీస్ బౌలర్లలో స్మిత్ 2 వికెట్లకు (61 పరుగులు), ఓరెల్ ఒక వికెట్ (79), ఆట్కిన్సన్ ఒకవికెట్ (99), సాబర్స్ ఒకవికెట్ (60 పరుగులు) తీసుకొన్నారు.

వెస్ట్ ఇండీస్ తరఫున ఎఫ్. ఎమ్. ఓరెల్ 29 పరుగులతోను, జి. సాబర్స్ 24 పరుగులతోను ఇంకా బాట్ చేస్తున్నారు.

ప్రభుత్వ ఆస్పత్రిలో శీతజ్వరానికి మందులు తీసుకొనడానికి వచ్చే రోగుల సంఖ్య రోజురోజుకూ పెరుగుతున్నది. క్రిందటి బుధవారం ఆస్పత్రికి వెళ్లిన రోగులసంఖ్య 550 వరకు ఉన్నది.

శీతజ్వరం వ్యాప్తి నిరోధించడానికి వెంటనే తగు చర్యలు జరపమని గుంటూరుజిల్లా ఆరోగ్య శాఖాధికారిని ఒంగోలు సబ్‌కలెక్టరు శ్రీ జి. ఆర్. నాయర్ కోరారు. (స్వ. వి.)

**కొత్తపల్లి**

తూర్పుగోదావరిజిల్లా కొత్తపల్లి గ్రామంలో నిన్నటివరకు దాదాపు 1000 మందికి శీతజ్వరం వచ్చినది. పరిసర గ్రామాలలోకూడా ఈ వ్యాధి వ్యాపించినది.

**గొల్లలకోడేరు**

భీమవరం తాలూకా గొల్లలకోడేరు గ్రామంలో నిన్నటివరకు మొత్తం 150 మందికి ఈ వ్యాధి సోకినది. ఎండగండి, పాలకోడేరు గ్రామాలలోకూడా శీతజ్వరం వ్యాపించినది. ఈ గ్రామంలో ఆస్పత్రిలేదు. వైద్యసహాయానికి వెంటనే తగు ఏర్పాట్లు చేయమని ప్రభుత్వానికి ప్రజలు విజ్ఞప్తి చేస్తున్నారు.

**మారుటేరు**

మారుటేరు, పెనుగొండ ప్రాంతాలలో శీతజ్వరం ఉధృతంగా వ్యాపిస్తున్నది. మొత్తం 11 గ్రామాలలో ఇంతవరకు ఈ వ్యాధి తీవ్రంగా ఉన్నది. పాఠశాలలు మామూలుగా పనిచేస్తున్నవి. వైద్యసహాయానికి కూడా ఇంతవరకు ఎట్టి ఏర్పాట్లు జరుగలేదు. (స్వ. వి.)

# భారత ఒలింపిక్ సంఘం

మద్రాసు, జూలై 5: రాష్ట్రాల పునర్నిర్మాణం పర్యవసానంగా రాష్ట్ర ఒలింపిక్ సంఘాల పునర్నిర్మాణం ఆవశ్యకమైనది, దానితోపాటు నియమావళి సవరించవలసిన అవసరం కూడా ఏర్పడినది.

భారత ఒలింపిక్ సంఘం ఈనెల 18వ తేదిని ఢిల్లీలో సమావేశమైనప్పుడు పై విషయాలు పరిశీలించవలసి ఉంటుందని అధ్యక్షుడు పాటియాలా మహారాజా, రాష్ట్రసంఘాలకు సూచించారు.

# బ్రిటిష్ గోల్ఫ్ ఛాంపియన్‌షిప్

సెయింట్ ఆండ్రూస్ (స్కాట్లండ్), జూలై 5: దక్షిణాఫ్రికా ఆటగాడు ఎ. డి. (బాబీ) లాక్ ఈ రోజు 72 హోల్స్‌కు 279 స్ట్రోక్స్ స్కోరుతో బ్రిటిష్ ఓపెన్‌గోల్ఫ్ ఛాంపియన్‌షిప్ గెలుపొందారు. నాలుగు రౌండ్లకు ఆయన స్కోర్సు ఇవి: 69, 72, 68, 70.

# మూడు రోజులపాటు సైకిల్ స్వారీ

కొణకంచి, జూలై 3: గుంటూరు జిల్లా తాటికొండ వాస్తవ్యులు నంది పాటి భవానిశంకర్ ఈ గ్రామంలో క్రిందటి నెల 25 సాయంకాలం 6 గంటలనుంచి 29వ తేదీ సాయంకాలం వరకు మూడు రోజులపాటు నిర్విరామంగా సైకిల్ త్రొక్కారు. వీరు ఇంతవరకు రాష్ట్రంలో 32 ప్రదేశాలలో ఇట్టి ప్రదర్శనలు ఇచ్చారని తెలుస్తున్నది. గ్రామప్రజలు వారికి 150 రూపాయలు బహూకరించారు.

# చిత్తూరులో పన్నుల హెచ్చింపు

చిత్తూరు, జూన్ 30: పురపాలక సంఘం నిన్న శ్రీ పి. వి. శ్రీనివాసన్ అధ్యక్షతన సమావేశమై ప్రభుత్వ సలహా ప్రకారం ఇండ్లపన్నులు 29% వరకు పెంచారు. దీపాలపై ఏడాదికి 1½% పన్ను కొత్తగా విధించారు. (స్వ. వి.)

# మదరాసు ధరలు

మదరాసు, జూలై 6:

బంగారు వెండి నేటి మధ్యాహ్నం 1 గంటకు వరకు 1-3 ఎడ్వర్డుబొమ్మ

| | | |
|---|---|---|
| సేల్సుటాక్సుతో సహా | రు. | 70.75 |
| పేట్లాబంగారం తులం | రు. | 106.37 |
| మూసా బంగారం తులం | రు. | 105.00 |
| సీమవెండి తులం 100కి | రెడి | 188.50 |
| చిల్లర ధర | రు. | 1.87 |

**వేరుశనగ**

(551 సా॥ 1-3 ఎక్సుకోస్తా గిడ్డంగులు మెషిన్ సేల్సుటాక్సుతో సహా)

| | | |
|---|---|---|
| డిసెంబరు | రు. | 165-170 |
| వేరుశనగనూనె ఎక్సుపెల్లర్ బిలో % పా.) రెడి చిల్లర ధర | | 385.00 |

(ఎక్సుపెల్లర్ కి రు. 35, సేల్సుటాక్సు, ఎక్సైజ్ సుంకంతో సహా)

50 టెంకాయనూనె (87½ పౌనులు సేల్సుటాక్సు అదనం,

| | | |
|---|---|---|
| అంబుమార్కు | రు. | 81.00 |
| ఎం. ఎస్. బ్రాండ్ డబ్బా | | 81.50 |
| రాజా | రు. | 81.25 |

**ఆముదం**

| | | |
|---|---|---|
| తిరుపత్తూరు (500 పౌ.) | రు. | 340.00 |

**పంచదార**

| | | |
|---|---|---|
| సేలం లోటస్ క్యాన్ (87½ పౌ) | | 28.00 |
| అనకాపల్లి (226 పౌ.) | | 109.71 |
| కొవ్వూరు (229 పౌ.) | | 110-.79 |
| నెల్లికుప్పం (226 పౌ.) | | 109.14 |

# న్యూయార్కు దూది

## అక్టోబరు వాయిదా ధరలు

న్యూయార్కు, జూలై 5: న్యూయార్కు, కాటన్ మార్కెట్ ధరలు నేడు ఈవిధంగా ఉన్నవి:

| | |
|---|---|
| నేటి ప్రారంభ ధర | 35.08 |
| నేటి ముగింపు ధర | 35.05 |

# ఆకాశవాణి

సోమవారం, జులై 8

**హైదరాబాద్**
(411 మీటర్లు)

ఉ॥ 6-50 సుప్రభాత్ 7 తెనుగు వా 7-15 నాదస్వరం 7-45 కన్నడ వా 8 ఆంగ్ల వా 8-15 హిందీ వా 8-30 సితార్.

మ॥ 12-30 సుగమ సంగీత్ 12-50 మరాటీ వా 1 సారంగి 1-10 శాస్త్రీయ సంగీతం 1-50 తెనుగు వా 2 సారంగి 2-10 ఉన్నత పాఠశాలలకు (ఆంగ్ల కార్యక్రమం) 2-40 సితార్ 2-50 ప్రాథమిక పాఠశాలల విద్యార్థులకు 3-20 ప్రచారసమాప్తి 3-45 పాఠశాలలకు (ఉర్దూ)

సా॥ 5-30 భజన్ 5-45 కర్ణాటక సంగీతపాఠం 6 స్థానిక ప్రకటనలు 6-5 ప్రాంతీయ వా 6-15 గ్రామసీమ 7 తెనుగు వా 7-15 గ్రామసీమ 7-30 మన ప్రాచీన విజ్ఞానసంపద (ప్రసంగం) 7-45 వీణ పి. సోమేశ్వరరావు 8-45 గీతావళి. 9 ఆంగ్ల వా. 9-15 ఉ.వా. 9-30 భజన్ 9-45 సితార్ 10-30 ప్రసారసమాప్తి.

**విజయవాడ**
(357.1 మీటర్లు)

ఉ॥ 6-30 శుభోదయం 6-35 ప్రచార విశేషాలు 6-40 భక్తిరంజని 7 తె వా 7-15 నాదస్వరం (హైదరాబాదు నుంచి రిలే) 7-45 సంగీత శిక్షణ 8 ఆం. వా. 8-15 హిం. వా.

మ॥ 12-30 మాధ్యమిక పాఠశాలల విద్యార్థులకు 1 గానసుధ 1-30 గీతమంజరి 1-40 హిం. వా. 1-50 తె. వా. 2 వీణ 2-10 ఉన్నత పాఠశాలల విద్యార్థులకు (ఆంగ్ల కార్యక్రమం) 2-40 వీణ 2-50 ప్రాథమిక పాఠశాలల విద్యార్థులకు.

సా॥ 5-30 సి. సత్యాదేవి 6 స్థానిక ప్రకటనలు 6-05 ప్రాంతీయ వార్తలు 6-15 గ్రామస్థుల కార్యక్రమం 7 తె. వా. 7-15 గ్రామస్థుల కార్యక్రమం 7-30 మన ప్రాచీన విజ్ఞాన సంపద (హైదరాబాదు నుంచి రిలే) 7-45 సుగమ సంగీత్ 8 రాగరసం 8-30 సి. సత్యాదేవి 9 ఆం వా. 9-15 అమరావతి శిల్పాలు (ఆంగ్ల ప్రసంగం) 9-30 వాద్య సంగీతం 9-45 రుక్మిణీ కళ్యాణం. (హరికథా కాలక్షేపం) 10-30 ప్రసార సమాప్తి.

**మద్రాస్ (ఎ)**
(819.1 మీటర్లు)

ఉ॥ 6-50 స్వాగతం, 6-55 కార్యక్రమ వివరణ, 7. వాద్యసమ్మేళనం, 7-15 త. వా, 7-30 దీక్షితర్ కృతులు.

మ॥ 12-30 మాధ్యమిక పాఠశాలల విద్యార్థులకు, 1. మాదర్ నిగప్పి, 1-30 గీతమంజరి, 1-40 హిం. వా, 1-50 గీతమాలిక. 2. త. వా, 2-10 ఉన్నత పాఠశాలల విద్యార్థులకు (ఆంగ్ల కార్యక్రమం), 2-40 క్లారినెట్, 2-50. ప్రాథమిక పాఠశాలల విద్యార్థులకు (తమిళం).

సా॥ 5. పాశ్చాత్య సంగీతం, 5-30 సుగమ సంగీత్, 6-05 ప్రాంతీయ వార్తలు, 6-15 ఎస్. ఆర్. జానకిరామన్, 6-45 బి. సుశీల, 7-15 త.వా 7-30 జంత్ర సమ్మేళనం, 7-45 భజన్, 8-30 టి. వెంకటరామఅయ్యర్, 9-15 హిందీపాఠం, 9-30 ఆర్. రంగరామానుజఅయ్యంగార్ (వీణ) 10-30 ప్రసార సమాప్తి.

**మద్రాస్ (బి)**
(211.3, 41.82 మీటర్లు)

ఉ॥ 6-50 ఎ వలె 7 తె. వా. 7-15 ఉదయగానం 7-30 ఎ వలె 8 ఆం.వా.

(211.3, 31.28 మీటర్లు)

మ॥ 12 కార్మికుల కార్యక్రమం 12-30 మాధ్యమిక పాఠశాలల విద్యార్థులకు 1 గీతమాలిక 1-30 ఆం. వా. 1-40 గానకుమంజరి 1-50 తె. వా. 2 గీతమంజరి 2-10 ఎ వలె 2-40 వీణ (విజయవాడనుంచి రిలే) 2-50 ప్రాథమిక పాఠశాల విద్యార్థులకు.

(211.3, 49.30 మీటర్లు)

సా॥ 5 ఎ వలె 5-50 స్థానిక ప్రకటనలు 6 ఆం. వా. 6-05 ప్రాంతీయ వార్తలు 6-15 గ్రామస్థుల కార్యక్రమం 7 తె. వా. 7.15 గ్రామస్థుల కార్యక్రమం 7-30 మన ప్రాచీన విజ్ఞాన సంపద (హైదరాబాదునుంచి రిలే) 7-45 మలయాళ కార్యక్రమం 8 వయొలిన్ టి. కృష్ణమూర్తి ప్రభృ (తిరుచ్చి నుంచి రిలే) 8-30 ఎ వలె 9 ఆం. వా. 9-15 ఏదువారం 9-30 ఎ వలె 10-30 ప్రసారసమాప్తి.

# పెద్దమనుష్యుల దొంగవ్యాపారం

న్యూఢిల్లీ, జూలై 5: నల్లమందు దొంగవ్యాపారానికి ఢిల్లీ ఒక పెద్దకేంద్రమైందని ఈ మధ్యపోలీసులు జరిపిన పరిశోధనలవల్ల తేలింది. గత ఒకటిన్నర నెలలలోను 225 మంది దొంగవ్యాపారులను పట్టుకొని వారినుండి 85 వేల రూపాయలు ఖరీదుచేసే నల్లమందును, సారాయినీ, స్వాధీనం చేసికొన్నారు. ఈ వ్యాపారం చేస్తున్న వారుసంఘంలో పెద్దమనుష్యులుగా మన్ననలు పొందుతున్నవారే అని పోలీసుశాఖ ఉన్నతోద్యోగి ఒకరు తెలిపారు. రాజస్థాన్, పాటియాలా, పంజాబ్‌లోని కొన్ని ప్రాంతాలనుండి ఈ వ్యాపారం సాగుతోంది.

దొంగసారాయి తయారుచేసే ఇరవై బట్టీలను పోలీసులు స్వాధీనపరచుకొన్నారు. ఈ వ్యాపారాన్ని అరికట్టేందుకు ఢిల్లీ పోలీసులు ప్రత్యేక దళాన్ని ఏర్పాటు చేశారు.

## గంటల పంచాంగం

శ్రీ హేమలంబ సం॥ ఆషాఢ శు॥ ఏకాదశి 1957 సం॥ జూలై 7 ఆదివారం ఆ॥ ఏకాదశి రా 2-6 విశా 24-8 వర్జ్యం 5-59 ల 7-26 వ వర్జ్యం రా 4-41 ల.

శు॥ ద్వాదశి జూలై 8 సోమవారం శు॥ ద్వాదశి రా 2-5 అనూ రా 1-14 వర్జ్యం తె 6-20 వ.

ఆంధ్రపత్రిక

ఒకరికే యది చొనవరించిన
పరవర యుప్రియము తన మనంబున కగు దా
నొరులకు నవిసేయకునికి
పరాయణము పరమధర్మ పదములకెల్లన్
(మహాభారతము)

హేమలంబ సం॥ ఆషాఢ శు॥ ఏకాదశి

ఆదివారం

## కామన్వెల్తు ప్రధానుల ప్రకటన

కామన్వెల్తు ప్రధాన మంత్రుల సమావేశం సమాప్తమైనది. వారం రోజులు వీరు ప్రపంచ సమస్యలను చర్చించారు. ఈ సమస్యలపై ప్రధాన మంత్రులందరూ వారి అభిప్రాయాలను స్పష్టంగా వెల్లడించారు. పరిష్కార మార్గాలను సూచించారు. వీటన్నింటినీ సమన్వయం చేసి ఒకవిధమైన ఏకాభిప్రాయాన్ని రూపొందించడం అంత సులభంకాదు. అయినా ప్రధాన సమస్యలన్నింటిమీదా ప్రధాన మంత్రులు ఏకాభిప్రాయానికి రాగలిగినట్లు సమాలోచనలు ముగిసిన తరువాత వెలువడిన అధికార ప్రకటనవల్ల విదితమవుతున్నది.

ఈ సంవత్సరపు కామన్వెల్తు ప్రధానమంత్రులసమావేశంలో రాజకీయ సమస్యలకంటే ఆర్థిక సమస్యలు ప్రాధాన్యం వహించినట్లు కన్పిస్తుంది. మరో రెండు మాసాల్లో ప్రపంచ బ్యాంకు, అంతర్జాతీయ ద్రవ్యనిధి సమావేశాలు జరుగనున్నవి. ఆ సమావేశాలు పూర్తి అయిన తర్వాత, కామన్వెల్తు ఆర్థిక మంత్రులు అట్టావాలో సమావేశంకావాలని కెనడా ప్రధాన మంత్రి సూచించారు. పారిశ్రామికంగా వెనుకబడి వున్న రాజ్యాల ఆర్థికాభివృద్ధికి విదేశాల సహాయం ఎక్కువగా కావలసి వుంటుంది. కొలంబో పథకాన్ని అనుసరించి జరుగుతూవున్న సహాయం స్వల్పం కాకపోయినా యీ దేశాల సర్వతోముఖ అభివృద్ధికి చాలదు. పారిశ్రామికంగా అభివృద్ధిచెంది ఇతర రాజ్యాలకు సహాయం చేయగల స్థితిలో వున్న రాజ్యాలు, కామన్వెల్తులోని ఇతరరాజ్యాలకు చేయగల సహాయం పరిమితమైనది. కామన్వెల్తు ప్రధానమంత్రులు ఈ విషయాన్ని గ్రహించక పోలేదు. వెనుకబడి వున్న రాజ్యాల అభివృద్ధికి పెట్టుబడి ధనం చాలాకాలంవరకూ కావలసివుంటుంది. కనుక యితర రాజ్యాలు పెట్టుబడి పెట్టడానికి తగిన ప్రోత్సాహం ఇవ్వాలని, అందుకు అనుకూలమైన పరిస్థితులు కల్పించాలని ప్రధాన మంత్రులు సూచించారు. వచ్చే ఒకటి రెండు సంవత్సరాల్లోనూ బ్రిటన్ షుమారు 20 కోట్ల పౌన్లు సహాయం చేయవలసి వుంటుందని శ్రీ నెహ్రూ వెల్లడించారు. ఈ విషయం శ్రీ నెహ్రూ బ్రిటిష్ ప్రధానమంత్రితోనూ, ఆర్థిక మంత్రితోనూ స్థూలంగా చర్చించి యుండవచ్చును. ఇందుకు సంబంధించిన వివరాలను భారతప్రభుత్వాధికారులు బ్రిటిష్ అధికారులతో చర్చిస్తున్నట్లు ప్రధాన మంత్రి తెలియజేశారు. ఈ సమాలోచనల ఫలితంగా బ్రిటిష్ పెట్టుబడిదారుల వైఖరిలో అనుకూలమైన మార్పు రాగలదని ఆశింపవచ్చును. ద్వితీయ ప్రణాళిక పూర్తిగా అమలు జరిగితే భారతదేశం దిగుమతులు తగ్గిపోతవనే భయం బ్రిటిష్ పారిశ్రామికులకు అవసరం లేదని, ప్రజల జీవితప్రమాణాన్ని వృద్ధి చేయడానికి భారత ప్రభుత్వం ప్రయత్నిస్తున్నది గనుక దిగుమతులు పెరగగలవని శ్రీ నెహ్రూ చెప్పారు.

ఇక రాజకీయ విషయాలపై ప్రధాన మంత్రుల చర్చలు ప్రయోజనకరంగా వున్నవని నిరాయుధీకరణ, పశ్చిమాసియాలగురించిన అధికార ప్రకటనవల్ల విశదమైనది. పరిస్థితుల ఉద్రిక్తతను తగ్గించి, సామరస్యాన్ని పెంపొందించడానికి ఆయుధ విసర్జన ఎంత పరిమితంగా జరిగినా ఉపయోగకరంగా వుంటుందని ప్రధాన మంత్రులు అభిప్రాయపడినారు. అలాగే పశ్చిమాసియా విషయంలోనూ కామన్వెల్తు ప్రధానమంత్రులు క్రిందటి సంవత్సరం సంఘటనలను సమీక్షించడంపై కాలం వృథా చేయలేదు. పశ్చిమాసియాలో శాంతి నెలకొల్పడానికి ఆర్థిక, సాంఘిక అభివృద్ధిని సాధించడం అవసరమని, వీరు ప్రకటించారు. అరబ్ - ఇజ్రేల్ తగాదాను పరిష్కరించడం కూడా ముఖ్యమని, అరబ్ కాందిశీకుల సమస్య సత్వరం పరిష్కారం కావాలని వీరు అభిప్రాయపడినారు. ఈ విషయాల్లో కామన్వెల్తు రాజ్యాలన్నీ ఐక్యరాజ్యసమితిలో కూడా పరస్పరం సహకరించుకుంటూ పనిచేస్తే ఇంతవరకూ పరిష్కారం కాకుండా వున్న అనేక సమస్యలు సులభంగా పరిష్కారం కాగలవు.

## చేనేత పనివారికి గృహ నిర్మాణం

### మూడు రాష్ట్రాలలో ఏర్పాటు

న్యూఢిల్లీ, జూలై 6: మద్రాసులో, రెండుచోట్ల మైసూరు, ఉత్తర ప్రదేశ్‌లలో ఒక్కొక్కచోట చేనేత పారిశ్రామికులకు గృహాలను నిర్మించే పథకాలను కేంద్రం ఆమోదించిందని అధికార ప్రకటన వెలువడింది. ఇందుకు భారత ప్రభుత్వం ఇచ్చే ఆర్థికసహాయంలో మొదటి వాయిదాగా మూడున్నరలక్షల రూపాయలనుకూడా ప్రత్యేకించింది.

మద్రాసులో సేలంజిల్లాలోని తిరుచెంగోడులో నూరు గృహాలను, రామనాడ్ జిల్లాలోని శ్రీవిల్లిపుత్తూరులో నూరు గృహాలను నిర్మిస్తారు. తిరునల్వేలి జిల్లాలోని మేలపాళయం చేనేత పారిశ్రామికుల సహకార సంఘసభ్యుల గృహాల పునర్నిర్మాణ పథకాన్ని కూడా కేంద్రం ఆమోదించింది. ఉత్తర ప్రదేశ్‌లో మూరుగృహాలు, మైసూరులో ఏభైగృహాలు నిర్మిస్తారు.

సహకార సంఘాలు ఈ గృహాల నిర్మాణానికి, నిర్వహణకు బాధ్యత వహిస్తాయి. అనంతరం ఈ సంఘాలు అద్దెకు, వాయిదాల మీద పారిశ్రామికులకు అమ్మడం, వస్త్రాలను అమ్మడంవంటి పనులను నిర్వహిస్తాయి.

ఒక్కొక్క గృహానికి మూడువేల రూపాయల వంతున నిర్ణయించారు. ఈ ఖర్చులంతా మొదట కేంద్రమే భరిస్తుంది. దీనిలో మూడింట రెండువంతుల ఖర్చును ఋణంగాను, లెక్కింపడానికి సహాయంగాను కేంద్రం ఇస్తుంది. దీనికి తోడు నీటిసరఫరా, మురుగు కాల్వల నిర్మాణం మొదలైన వసతి సౌకర్యాలనుకూడా కేంద్రమే చేస్తుంది.

## బ్రిటన్‌కూడా దోపంలేని అణ్వాస్త్రాలు నిర్మిస్తోంది

లండన్, జూలై 4: అణు రజను మంచిలేని బాంబుల నిర్మాణానికి బ్రిటన్ కృషికూడా ఫలిస్తున్నదని, బ్రిటిషు ప్రధాని శ్రీ మాక్మిలన్ కామన్సుసభలో చెప్పారు.

# రష్యా కమ్యూనిస్టుపార్టీకి సైనికబలాల అండ

## మార్షల్ ఝుకోవ్, ఇతర సైనికాధిపతుల హామీ

### మరో ఇద్దరు నాయకులకు పదవీచ్యుతి

మాస్కో, జూలై 6: మాలటోవ్, కగనోవిచ్, మాలెంకోవ్, షెపిలోవ్‌ల బర్తరఫ్ నిర్ణయం సందర్భంలో రష్యా సైన్యం అంతా కమ్యూనిస్టుపార్టీ కేంద్ర సంఘానికి అండగా నిలవగలదని, మార్షల్ ఝుకోవ్, ఇతర సైనిక వైమానిక నౌకా దళాధిపతులు, అగ్రసేనాధిపతులు హామీ ఇచ్చారు.

దేశరక్షణ మంత్రి మార్షల్ ఝుకోవ్ కార్యాలయంలో కమ్యూనిస్టుల సమావేశం జరిగిందనీ, ఈ సమావేశంలో శ్రీ ఝుకోవ్ తదితర సైనిక అగ్రనాయకులు ప్రసంగించారనీ, మాస్కో రేడియో తెలుపుతున్నది.

మార్షల్ ఝుకోవ్ ఈ సమావేశంలో ప్రసంగిస్తూ, కేంద్ర సంఘానికి అండగా నిలిచి, దేశంపట్ల, ప్రజల పట్ల విధేయతతో వ్యవహరించే బలమైన సైనిక బలాలు సోవియట్ యూనియన్‌కు ఉన్నాయి అన్నారు.

మాలటోవ్ ప్రభృతులను కేంద్ర సంఘం, మాస్కో రేడియో, పత్రికలు కూడా "పార్టీ వ్యతిరేకవర్గం" అనే పేరు పెట్టి వ్యవహరిస్తున్నాయి.

పార్టీ విధానాలను మార్చడానికి, పార్టీ వ్యతిరేకవర్గం అనుసరించిన చర్యలను శ్రీ ఝుకోవ్ వివరించారు.

జూన్ కమ్యూనిస్టు కాంగ్రెస్ నిర్ణయాలవల్ల కమ్యూనిస్టుపార్టీ, పార్టీనాయకత్వాలు బలపడగలవనీ, పార్టీఇచ్చిన ముఖ్య ఆదేశాలను అమలు జరపడానికి తోడ్పడగలవనీ శ్రీ ఝుకోవ్ అన్నారు.

ఈ సమావేశంలో ఇతర సైనికాధిపతులూ, అగ్ర సైనిక నాయకులూ ప్రసంగించారు. అందరూ కేంద్ర కమ్యూనిస్టు సంఘతీర్మానాలను ఏకగ్రీవంగా ఆమోదించారు.

### మరో ఇద్దరు పదవీ భ్రష్టులు

మాస్కో, జూలై 6: కమ్యూనిస్టు పార్టీ అధ్యక్షమండలిలో సభ్యత్వం కోలుపోయిన మరో ఇద్దరు రష్యన్ నాయకులు కూడా మంత్రి పదవుల నుంచి బర్తరఫ్ అయినారని, టాస్ (రష్యా) వార్తాసంస్థ తెలుపుతున్నది. వారు శ్రీ మిఖైల్ జి. పెర్వుఖిన్, శ్రీ మాక్సింజబురోవ్, వీరిద్దరూ మంత్రి వర్గంలో ఉప ప్రధానులుగా ఉండేవారు.

పార్టీ అధ్యక్షమండలిలో పర్యాయ సభ్యులైన శ్రీ ఎలెక్సీ కొసైగిన్‌ను ఒక ఉప ప్రధానిగా నియమించారు.

### సేద్యఫలం గురించిన నిర్ణయాన్ని ప్రతిఘటించారు

లండన్, జూలై 6: "పార్టీవ్యతిరేక వర్గం తొలగింపుతో పార్టీ మళ్ళీ చక్కగా సంఘటితమయింది" అని సోవియట్ కమ్యూనిస్టుపార్టీకి చెందిన పత్రిక "ప్రవదా" ఇవాళ సంపాదకీయంలో వ్రాసింది.

కొత్తగా నిర్మితమయిన పార్టీ అధ్యక్షమండలి పట్ల పార్టీ సభ్యులందరూ, ప్రజలూ ఆమోదం తెలియ పరిచారని, ఈ పత్రిక చెపుతోంది.

సమిష్టి వ్యవసాయ క్షేత్రాలలోని వారు చిన్నచిన్న కమతాలు పెట్టుకున్న కార్మికులు మొదలైనవారు నిర్బంధంగా సేద్యఫలాన్ని ప్రభుత్వానికి కొంత అప్పగించే పద్ధతిని రద్దు పరచాలనే నిర్ణయాన్ని, ఈ పార్టీ వ్యతిరేక వర్గం ప్రతిఘటించిందని "ప్రవదా" పత్రిక ఆరోపించింది. కాని ఆ నిర్ణయాన్ని రష్యాలో ప్రజలందరూ హర్షించారట.

## ఆరబ్ రాజ్యాలతో మైత్రి

### షెపిలోవ్ తోనే ఉన్నదనుకోరాదు

లండన్ జూలై 4: అరబ్ ప్రపంచం పట్ల రష్యా విధానం పదవీచ్యుతుడైన శ్రీ షెపిలోవ్‌తోనే ఉందని భావించకూడదని, మాస్కో రేడియో అరబిక్ భాషా ప్రసారంలో ఇవాళ హెచ్చరించింది.

అరబ్ రాజ్యాలతో రష్యా సంబంధాలు దృఢపడ్డానికి శ్రీ షెపిలోవ్ కృషి కారణమని భావించరాదు.

రష్యావిధానాలు వీడొక్క వ్యక్తి నిర్ణయించేవి కావు; ప్రజలు ఎన్నుకున్న నాయకవర్గం నిర్ణయిస్తుంది. పూర్వం సిరియా లెబనాన్‌లనుంచి ఫ్రెంచి సైన్యాలను ఉపసంహరించాలనీ, ఇటీవల సూయజ్ కాలువ ప్రాంతంనుంచి ఆక్రమణపరుల సైన్యాలను ఉపసంహరించాలనీ రష్యా అడిగినప్పుడు, షెపిలోవ్ పార్టీలోనూ ప్రభుత్వంలోనూ అధినేత కాడు.

అరబ్ రాజ్యాలపట్ల రష్యావిధానం, ఎల్లప్పుడూ అరబ్ జాతీయ విమోచనోద్యమాన్ని బలపరచాలనే ప్రాతిపదికపైనే కొనసాగింది, ఈ ప్రాతిపదిక మారలేదు. ఇది రష్యాలో సామ్యవాద తత్వానికి సహజమైన విధానం. షెపిలోవ్ ప్రభృతులను తొలగించాలని పార్టీ కేంద్రసంఘం చేసిన నిర్ణయంవల్ల ఈ ప్రాతిపదిక మరింత బలపడుతుంది అని మాస్కో రేడియో చెప్పింది.

## రష్యా నాయకత్వంలో మార్పుకు చైనా హర్షం

హాంకాంగ్, జూలై 6: సోవియట్ రష్యా నాయకవర్గంలో మార్పులవల్ల అక్కడి కమ్యూనిస్టుపార్టీ బలపడగలదంటూ, చైనా కమ్యూనిస్టు నాయకులు సందేశం పంపారు.

ఇదే విధంగా, చైనా కమ్యూనిస్టు పార్టీ కేంద్రసంఘం, రష్యా కమ్యూనిస్టుపార్టీ కేంద్రసంఘానికి ఒకసందేశం పంపింది.

## యుగోస్లావ్ ఉపాధ్యక్షుల రష్యా ప్రయాణం

బెల్‌గ్రేడ్, జూలై 6: యుగోస్లావియా ఉపాధ్యక్షులు శ్రీ ఎడ్వర్డ్ కార్డెల్జు, శ్రీ అలెగ్జాండర్ రాంకోవిచ్ ఇద్దరూ త్వరలో "సెలవు తీసుకుని విశ్రాంతికి" రష్యా వెళ్ళగలరని ప్రభుత్వాధికారి ఒకరు చెప్పారు. వారిద్దరూ రష్యన్ నాయకులతో ఎలాగూ మాటలాడ కారనుకోవచ్చు అన్నారు.

రష్యా నాయకత్వంలో మార్పుల సమాచారం తెలియకముందే, ఈ ప్రయాణం ఏర్పాటయింది.

వీరిద్దరినీ సోవియట్ ప్రభుత్వం ఆహ్వానించిందో లేదో తెలియదు. వీరు వచ్చేవారం క్రిమియా వెళ్ళవచ్చునని ఇతరత్రా తెలుస్తున్నది. క్రిమియాలో శ్రీ కృశ్చేవ్‌కు ఒక విరామమందిరం ఉంది. యుగోస్లావియా ఉపాధ్యక్షులు రష్యా వెళ్ళే పరికి, శ్రీ కృశ్చేవ్ జెకోస్లోవేకియా నాయకులతోనూ, బహుశా ఇతర తూర్పుయూరప్ రాజ్యాలనాయకులతోనూకూడా సమాలోచనలు ముగించుకుని స్వదేశం చేరుకుంటారు.

## ఆసియా ఐరోపా సామ్యవాదాలు వేరు

### వియన్నాలో కృపలానీ ప్రసంగం

వియన్నా, జూలై 6: ఆసియా సోషలిస్టులు ఐరోపా సోషలిజమును అంగీకరించరని ఐరోపా సోషలిజం, మార్క్సు మతంమీద; భౌతికవాదం మీద ఆధారపడింది కావడమే ఇందుకు కారణమని భారత ప్రజాసోషలిస్టు నాయకుడు ఆచార్య కృపలానీ నేడు ఇక్కడ వివరించారు.

ఆసియాలో సోషలిజం ఐరోపా సోషలిజంవంటిది కాదు. ఆసియా సోషలిజం నీతిమీద, సమానత్వంమీద, న్యాయంమీద, మతంమీద ఆధారపడి ఏర్పడింది అని ఆయన అన్నారు.

భారత ప్రజాసోషలిస్టులను గురించి మాట్లాడుతూ "మేము పరిశ్రమల జాతీయం కరణానికి వ్యతిరేకులం" అన్నారు ఆచార్య కృపలానీ నిరుద్యోగాన్ని నివారించడానికి మేము పారిశ్రామిక వికేంద్రీకరణం మార్గంగా భావిస్తాము. అదీగాక పరిశ్రమల విషయంలో ఐరోపాకు, ఆసియాకు తేడాలు వున్నాయి. ఐరోపాకు కార్మికబలం తక్కువ. ఆసియాకు అట్లాకాదు. కార్మికబలం పుష్కలంగా వుంది" అని చెప్పారు.

ఆసియా సోషలిస్టులకు ఐరోపా సోషలిస్టులకు సాన్నిహిత్యం పెంపొందాలంటే, సోషలిస్టు ఇంటర్నేషనల్ స్వరూపం మారవలసి వుందని గూడా ఆయన ఈసందర్భంలో చెప్పారు.

ఆచార్య కృపలానీ అంతర్జాతీయ సోషలిస్టు మహాసభకు భారత ప్రజాసోషలిస్టు పార్టీ ప్రతినిధిగా హాజరైనారు. ఇప్పుడు ఇక్కడినుంచి, రుమేనియాకు, చెకోస్లావేకియాకు, అటుతర్వాత పశ్చిమ జర్మనీకి ఇంగ్లండుకు వెడతారు. ఆగస్టు అంతానికి భారతదేశం చేరుకుంటారు.

ఇవ్వాళ ఈసభలో ఆచార్య కృపలానీ, మాట్లాడిన మాటలకు సమాధానం ఇస్తు, ఆస్ట్రియా సోషలిస్టు పార్టీ సభ్యుడు, హొరస్ట్ స్ప్రైజర్ "ఐరోపా సోషలిజంపు మార్క్సు మతానికి ఏమీ సంబంధం లేదన్నారు. ఐరోపాలో సోషలిస్టులు ఆ మేమంది మార్క్సు "దాస్ కేపిటల్"ను దగ్గరకు గూడా రానీయరని గూడా చెప్పారు.

## రష్యా నాయక వర్గం మార్పులు

### కామన్వెల్త్ ప్రధానుల చర్చ

లండన్, జూలై 6: రష్యా నాయక వర్గంలో మార్పుల ఆంతర్యంగురించి కామన్వెల్త్ ప్రధాన మంత్రుల సమావేశం ఇవాళ చర్చించిందని, అధికార వర్గాలవల్ల తెలుస్తున్నది.

సమావేశంలో ఎవరి అభిప్రాయాలను వారు తెలియపరిచారు. మాలటోవ్ ప్రభృతుల బర్తరఫ్‌తో, రష్యా విదేశాంగ విధానంలో పెద్ద మార్పేమీ రాకపోవచ్చునని పలువురు అభిప్రాయ పడ్డారట. ఎందువల్లనంటే, శ్రీ కృశ్చేవ్ రష్యాలో అధికారాన్ని ఇదివరకే హస్తగతం చేసుకున్నారు.

పరిశ్రమల వికేంద్రీకరణ విషయంలో శ్రీ కృశ్చేవ్ ప్రతిపాదించిన సంస్కరణలలో రష్యాలో విషమస్థితి ఏర్పడి ఉంటుంది. దానివల్లనే ఈ మార్పులు జరిగిఉంటాయని ఒక భావం కనపడింది.

పారిశ్రామిక యాజమాన్య సంస్కరణలను ముఖ్యంగా శ్రీ మాలటోవ్, శ్రీ కగనోవిచ్ ప్రతిఘటించారు.

మరొక అభిప్రాయం ఏమిటంటే, సోవియట్ కమ్యూనిస్టుపార్టీ తన బలాన్ని, ప్రజలలో పరపతినీ నిలుపుకోవాలంటే, కఠిన నిర్బంధాలు కొంత సడలించడం అవసరం అని శ్రీ కృశ్చేవ్ భావించి ఉంటారు.

ఈ మార్పులమూలంగా, దేశరక్షణ మంత్రి మార్షల్ ఝుకోవ్ వ్యక్తిగత ప్రాబల్యం, అధికారం మరింత పెరుగుతాయని ఇంకొక ఊహ వ్యక్తమయిందిట. మార్షల్ ఝుకోవ్‌కు ఈ మార్పులవల్ల, కమ్యూనిస్టుపార్టీ అధ్యక్ష మండలిలో పూర్తి సభ్యత్వం లభించింది.

## రిపబ్లికన్ పార్టీ మంత్రివర్గం

### సుహ్రావర్దీ విముఖత్వం

కరాచి, జూలై 6: పశ్చిమపాకిస్తాన్లో తిరిగి రిపబ్లికన్ పార్టీ మంత్రి వర్గాన్ని నెలకొల్పేందుకు పాకిస్తాన్ ప్రధాని సుహ్రావర్దీ సుముఖంగా లేరని తెలుస్తోంది. రాష్ట్రంలోని పరిస్థితిపై లండన్‌లో వున్న శ్రీ సుహ్రావర్దీకి పశ్చిమ పాకిస్తాన్ గవర్నరు గుర్మానీ తెలియజేసి, రాష్ట్ర మంత్రివర్గం పునర్నిర్మాణం గురించి సలహా కోరినట్లు తెలిసింది. రిపబ్లికన్‌పార్టీ మంత్రి వర్గాన్ని తిరిగి ఏర్పాటు చేయాలని గుర్మానీ పాకిస్తాన్ అధ్యక్షుడు మీర్జాకు సిఫార్సు చేశారని రిపబ్లికన్ నాయకులు అంటున్నారు. కాని అలాంటిదేమీ జరగలేదని ముస్లింలీగు నాయకులు అంటున్నారు.

పశ్చిమ పాకిస్తాన్లో తిరిగి మంత్రి వర్గాన్ని ఏర్పాటు చేయించే సమస్యను పాకిస్తాన్ కేంద్ర మంత్రివర్గం పరిశీలించినట్లు తెలుస్తోంది. ఈ సమావేశానికి తాత్కాలిక ప్రధానిగా ఉన్న అహమ్మద్ అధ్యక్షత వహించారు. ముగ్గురు మంత్రులు, ఒక సహాయమంత్రి సమావేశంలో పాల్గొన్నారు. వీరంతా తూర్పు పాకిస్తానుకు చెందినవారే. మంత్రివర్గంలోని పశ్చిమ పాకిస్తాన్ సభ్యులలో కొంతమంది విదేశాలలో ఉన్నారు. మరి కొంతమంది లాహోర్‌లోను, నాథియాగలిలోను ఉన్నారు. ఇక్కడ పాకిస్తాన్ అధ్యక్షుడు మీర్జా సంప్రదింపులుసాగిస్తున్నారు. లాహూర్లో పార్టీ సమావేశం జరుగుతోంది. రాష్ట్రంలో ఏ పార్టీ మంత్రివర్గం ఏర్పడుతుందో స్థిరంగా తెలియదు. కాని అసలంటూ మంత్రివర్గాన్ని ఏర్పాటుచేసే అవకాశం కేంద్రం ఇస్తుందని తెలుస్తోంది.

ఇక్కడ ఇలా ఉండగా, తమ పార్టీకి అండగా 150 మంది శాసనసభ్యులు ఉన్నారని ముస్లింలీగ్ శాసనసభా పార్టీ నాయకుడు సర్దార్ బహదూర్ ఖాన్ గవర్నరు గుర్మానీకి ఒక జాబితా అందచేశారు. రిపబ్లికన్ పార్టీ నాయకుడు తమకు 171 మంది సభ్యుల తోడుగా ఉన్నదని గవర్నరుకు జాబితా ఇచ్చారు. రాష్ట్ర శాసనసభలో మొత్తం 308 మంది సభ్యులు ఉన్నారు. ఖాన్ సాహెబ్ ఇచ్చిన జాబితాలోని సభ్యులు అనేకమంది ముస్లింలీగు పార్టీని సమర్థించేవారని లీగ్ నాయకుడు గవర్నరుకు తెలిపినట్లు తెలుస్తోంది. పార్టీ బలాలు తేల్చుకొనేందుకు శాసనసభ అవధికార సమావేశాన్ని జరపవలసిందని కూడా ఆయన కోరారని తెలిసింది.

### పన్నుల పరిశీలక సంఘం ఏర్పాటు

కేంద్ర, రాష్ట్ర, స్థానిక రంగాలలోని పన్నులన్నిటినీ పరిశీలించేందుకు పాకిస్తాన్ ప్రభుత్వం ఒక పన్నుల పరిశీలక సంఘాన్ని ఏర్పాటుచేసింది. దేశంలో ఏర్పడిన అధికద్రవ్య చలామణీ వల్ల కలిగే ఫలితాలనుగురించి ఉన్న శాధికారులు ప్రభుత్వాన్ని హెచ్చరించారు. ఆర్థికశాస్త్రవేత్త జహీద్ హుస్సేన్ ఈ సంఘ అధ్యక్షులుగా ఉంటారు. ఈ సంఘ నివేదికను సమర్పించేందుకు ఒక తేదీని స్పష్టంగా పేర్కొనలేదు. సాధ్యమైనంత త్వరగా మాత్రం నివేదికను అందజేయమన్నారు. ప్రస్తుతం అపరిమితంగా జరుగుతున్న ఖర్చులను దేశం భరించలేదని ఆర్థికశాఖ కార్యదర్శి ప్రభుత్వాన్ని హెచ్చరించారు. 1954 ఆఖరునాటికి 380 కోట్ల రూపాయల ఖర్చు 1957 లో 580 కోట్లు అయిందన్నారు.

రక్షణ,సచివాలయోద్యోగులనిమిత్తం చేస్తున్న అపరిమిత ఖర్చువల్ల, ప్రభుత్వ ఖర్చు విపరీతంగా పెరిగిందని స్టేట్ బ్యాంకు గవర్నరు అబ్దుల్ ఖాదర్ హెచ్చరించారు.

### బర్మాతో బియ్యం ఒప్పందం

బర్మానుండి మరో 75 వేల టన్నుల బియ్యాన్ని కొనేందుకు పాకిస్తాన్ ఒప్పందం కుదుర్చుకొందని తెలుస్తోంది. దీనితో బర్మానుండి 150 వేల టన్నుల బియ్యాన్ని పాకిస్తాన్ దిగుమతి చేసికొంటుంది.

# నిరాయుధీకరణ వ్యవహారంలో పరిమిత ఒప్పందం అయినా మంచిదే

## కామన్‌వెల్తు ప్రధానుల సమిష్టి ప్రకటన: సమితిని బలపరచడానికి నిర్ణయం

లండన్, జులై 5: నిరాయుధీకరణ సమాధానం ఎంత పరిమితంగా కుదిరినా మంచిదేనని, అందువల్ల ఆయుధ విసర్జన వ్యవహారాన్ని పూర్తిగా తేల్చేందుకు అనువైన వాతావరణం ఏర్పడ్డానికి దోహదం లభిస్తుందని కామన్‌వెల్తు ప్రధాన మంత్రులు తమ సమష్టి ప్రకటనలో విశదంచేశారు.

అంతే, ఇప్పుడు పరిమితమైన ఒప్పందాన్ని కుదుర్చుకోగలిగితే, అందుమూలంగా, ప్రపంచం అంతటా ఉద్రేకాలు తగ్గాయని, అనుమానాలు తొలగుతాయనిగూడా తాము భావిస్తున్నట్లు, ఈ ప్రధాన మంత్రులు, ఈ సమష్టి ప్రకటనలో పేర్కొన్నారు.

### కామన్‌వెల్తు అణు శాస్త్రజ్ఞుల సభ

అణుశక్తి శాంతి ప్రయోజన ఉపయోగాలను గురించి చర్చించడానికి, ఈ అన్ని రాజ్యాలు కలిసి పని చెయ్యడాన్ని గూర్చి మాట్లాడ్డానికి వచ్చేయేడు బ్రిటన్‌లో కామన్ వెల్తు అణు శాస్త్రజ్ఞులసభ జరిపించడానికి ఈ ప్రధానులు నిర్ణయించుకున్నారు.

### అట్టోవాలో ఆర్థిక మంత్రుల సభ

అంతర్జాతీయ ద్రవ్యనిధి, ప్రపంచ బ్యాంకుల సమావేశాలు ఈ సంవత్సరం సెప్టెంబరులో జరుగుతాయి. అవి అయిన అనంతరం కామన్‌వెల్తు ఆర్థిక మంత్రులు సమావేశం కావడం మంచిదని, ఆ సమావేశాన్ని అట్టోవాలో జరిపించవలసిందని కెనడా ప్రధానమంత్రి సూచించారు. కామన్‌వెల్తు ఆర్థిక మంత్రులను అందుకు ఆహ్వానించారు. ఇటువంటి సమావేశంవల్ల, ఆర్థిక విషయాలలో కామన్‌వెల్తు రాజ్యాలమధ్య సహకారాన్ని గూర్చి చర్చలు జరుపుకోడానికి తగు అవకాశం లభిస్తుంది. అని ప్రధానమంత్రుల ప్రకటనలో వుంది.

### మధ్యప్రాచ్య వ్యవహారాలు

మధ్యప్రాచ్య వ్యవహారాలలో ఈ విషయాలనుగురించి, ఈ ప్రధానుల మధ్య ఏకీభావం కుదిరింది. "మధ్యప్రాచ్యంలో ఆర్థిక సుస్థిరత్వం ఏర్పరేట్లు చూడాలి. అయితే ఇది దీర్ఘకాలంమీదగాని జరగదు. ప్రస్తుతం అక్కడ, ఇజ్రాయల్ అరబ్ తగాదాలవల్ల ఏర్పడ్డ ఉద్రేకాలు తగ్గేట్లు చూడాలి. అరబ్ శరణార్థుల సంగతి, సూయజ్ వ్యవహారంలో ఇంకా తేలనిసంగతి గూడా ఆలోచించాలి.

### వర్తకము, వాణిజ్యము

ఈ సమావేశానికి హాజరైన బ్రిటన్, కెనడా, ఆస్ట్రేలియా, న్యూజిలాండు, దక్షిణ ఆఫ్రికా, భారతదేశం, పాకిస్తాన్, శ్రీలంక, ఘన, రొడీషియా, న్యాసాలాండు ప్రధాన మంత్రులు, ప్రతినిధులు, ఈ సందర్భంలో వర్తక వాణిజ్య వ్యవహారాలను గూర్చి గూడా చర్చించారు. క్రిందటిసారి ఈ సమావేశం జరిగినప్పటి, ఇప్పటి, ఈ వ్యవహారాలలో వొచ్చిన మార్పులను సమీక్షించారు. సమీక్షించి వర్తక వాణిజ్యాలు కొంత తెరిపినిపడ్డాయని కనిపెట్టారు. ఐరోపా స్వేచ్ఛా వ్యాపార మండల నిర్మాణాన్ని గురించి, ఐరోపా ఆర్థిక సమాజ వ్యవహారాలను గురించి గూడా చర్చించారు. ఇక కామన్‌వెల్తులో కొన్ని కొన్నిదేశాల వ్యవహారాలు వేరుగా వున్నాయి గనుక, ఆ అన్ని విషయాలను గురించిన్నీ, వచ్చేవారంలో, అన్ని కామన్‌వెల్తు దేశాల ఉద్యోగులు సమావేశమై చర్చిస్తారు.

సమితి ధర్మాలప్రకారం ప్రపంచంలో శాంతిని, న్యాయాన్ని, సహకారాన్ని సంరక్షించడం విషయంలో సమితి గట్టిగా పనిచేసేందుకు వీలుగా, ఆ సంస్థను సమర్థించాలని, బలపరచాలని కామన్‌వెల్తు ప్రధానులు నిర్ణయించుకున్నారు. వివిధ రాజ్యాలమధ్య సహకార భావ మూర్తాలు క్రియారూపంలో అల్లుకొనేందుకు తగిన అవకాశాలను కల్పించడానికి వీలుగా సమితి ఏర్పాటైంది. సమితి ప్రధాన ధర్మాలలో ఇదిఒకటి. అయితే అనుభవంలో, ఈ సమితి పనిచేస్తున్న పద్ధతిలో, కొన్ని లోపాలు, కొన్ని బలహీనతలు కన్పిస్తున్నాయి అని వీరి ప్రకటనలో పేర్కొన్నారు.

### హంగరీని గురించి

హంగరిని గురించి ఈ ప్రకటనలో ఈలావుంది: "క్రిందటిసారి కామన్‌వెల్తు ప్రధానులసభ జరిగిన అనంతరం నుంచి ప్రపంచంలో జరిగిన సంఘటనలను గూర్చి కామన్‌వెల్తు ప్రధాన మంత్రులు చర్చించారు. హంగరీలో జరిగిన సంఘటనలను గురించి వీరు మహా ఆందోళన చెందారు. రేపు జరిగే సమితి సమావేశంలో ఈ దంతాన్ని గూర్చి తయారైన నివేదికను గూర్చి చర్చ జరుగుతుంది. అప్పుడు ఈ విషయంలో సమితి అభిప్రాయం ఏమిటో తెలుస్తుంది."

### పశ్చిమాసియా వ్యవహారాల

పశ్చిమాసియా వ్యవహారాలను గురించి, ఆగ్నేయ ఆసియా వ్యవహారాలను గూర్చి గూడా వీరు చర్చించారు. ఆ ప్రాంతాలలో ఉద్రేకాలు తగ్గించడానికి, శాంతి సంరక్షణకు, స్థిరత్వ, రాజకీయ స్వాతంత్ర్యాల పరిరక్షణకు కృషి జరగవలసి వున్నదని వీరు భావిస్తున్నారు. ఈ ప్రాంతం అభివృద్ధికి, కొలంబో పథకాన్ని అనుసరించి జరుగుతున్న కృషి మెచ్చుకోదగిందిగా వున్నదని ఆమోదించారు.

### ప్రధాన లక్ష్యం

"కామన్‌వెల్తు దేశాల ప్రధానలక్ష్యం ప్రపంచ శాంతి, ప్రపంచ భద్రతలకు సంబంధించింది. ఈ ప్రపంచంలో అన్ని రాజ్యాలు కలిసి, పరస్పరమైన సహకారంతో పనిచేస్తేనే, ఈ లక్ష్యాన్ని సాధించడం సాధ్యం అని వీరు భావిస్తున్నారు. ఈ సహకార సూత్రాన్ని దాని ఆచరణను గూడా వీరుఆమోదిస్తున్నారు. కామన్‌వెల్తుకు పునాది ఈసహకార సూత్రమే. అందుచేత ఇప్పుడు దీనిని, ఈ సహకార సూత్రాన్ని ఇంకా విస్తరింప జేయడానికి ఈ రాజ్యాలు కృషి చేస్తాయి"

### కామన్‌వెల్తు దేశాలకు బ్రిటన్ ఆర్థిక సహాయం

"పూర్వం లాగానే ఇక ముందు గూడా బ్రిటన్ కామన్‌వెల్తు దేశాల అభివృద్ధికి తగు సహాయాన్ని చేస్తూ వుంటుంది. ఇందుకు ఇతర కామన్‌వెల్తు దేశాలగూడా తగిన విధంగా సహాయం చేస్తున్నాయి. కాని ఈదేశాలకు పెట్టుబళ్లు అధికంగా కావలసి వస్తూవున్నందువల్ల, ఇతరచోట్లనుంచి గూడా ఈ పెట్టుబళ్లు ఎక్కేటట్లు ఈ దేశాలు చూచుకోవలసి వుంది."

### మలయాకు సభ్యత్వం

మలయా, సమాఖ్యకు త్వరలో స్వాతంత్ర్యం లభిస్తున్నందుకు ఈ మంత్రులు సంతోషాన్ని వ్యక్తం చేశారు. అందుకు మలయాకు తమ శుభాకాంక్షలను తెలియచేశారు. జరగవలసిన రాజ్యాంగికమైన కర్మకాండ అంతా పూర్తిఅయినతర్వాత, కామన్‌వెల్తులో భాగస్వామిగా, మలయాను గుర్తించడానికి సుముఖ భావాన్ని వ్యక్తంచేశారు.

### బ్రిటన్‌కు అభినందన

ఘనారాజ్య ప్రతినిధులు ఈ సభలో సంపూర్ణ స్వాతంత్ర్యంతో పాల్గొనడంగూడా ఈ మంత్రులకు సంతోషాన్ని కల్గించింది. "అధీనదేశాలలో రాజ్యాంగికమైన అభివృద్ధిని సాధించాలని, బ్రిటన్ పెట్టుకున్న విధానం, ఇట్లా చరితార్థం అవుతున్నందుకు వీరు ఆనందాన్ని వ్యక్తంచేశారు.

### భరతవాక్యం

"కామన్‌వెల్తు అన్నది స్వతంత్రము, స్వేచ్ఛకలిగిన రాజ్యాలయొక్క కూడిక. అందువల్ల ఇందులో వివిధ సమస్యలను గూర్చి చర్చల్లో, అంతా ఒకే అభిప్రాయంలో వుంటారనిలేదు. కొన్ని కొన్ని పట్టుల్లో అభిప్రాయ భేదాలంటూ వుంటాయి. అయితే, ఉద్దేశాలలోనేమి, వైఖరులలోనేమి, వీరిలో ఆట్టే తేడాలులేవు. అక్కడ చాలా వరకు వీరు ఒక్కటిగా వున్నట్లు చెప్పక తప్పదు. ఈ సభలో అందరూ అంగీకరించే నిర్ణయాలు జరగడం అని, అధికార తీర్మానాలు ప్రకటించడం అని, అందువల్ల, వుండదు.

హైదరాబాదు, జూలై 6: నిజామాబాదుజిల్లా గీత పనివారి మహాసభను ఈ నెల 7 వ తేదీన శాసన సభ్యుడు శ్రీ గొతు లచ్చన్న ప్రారంభిస్తారు. శ్రీ గంగాధర గౌడ్ అధ్యక్షతన బోధన్‌లో ఈ మహాసభ జరుగుతుంది.

## వ్యవసాయోత్పత్తి ప్రభుత్వ స్వాధీనం

### నిర్బంధం సడలిస్తూ రష్యాప్రభుత్వ ఉత్తర్వు

లండన్, జూలై 4: సహకార వ్యవసాయక్షేత్రాలు మొదలైన వాటిలో సభ్యులుగావున్న వ్యక్తులు సాగు చేసే వ్యక్తిగత సాగు ఫలితాన్ని ప్రభుత్వానికి స్వాధీనంచేసేటిలాగున నిర్బంధమును సోవియట్ కమ్యూనిస్టుపార్టీ, ప్రభుత్వమూ సడలించాయి. ఈ సంస్థలలో సభ్యులుగావున్న వారికి మాత్రమే ఈ వ్యవసాయోత్పత్తి స్వాధీన తొలగింపు వర్తిస్తుంది. కాని అన్నిరకాల వస్తువుల నిర్బంధ స్వాధీనానికి వర్తించదు. ఈ ఉత్తర్వు 1958 జనవరి మొదటి తేదీనుంచి అమలులోనికి వస్తుంది. సహకారసాగు, ప్రభుత్వసాగు విధానాలవల్ల రైతులు, కార్మికులు స్వాధీనం చేసే ఉత్పత్తి 1958 లో ఎంతో తగ్గిందన్న విషయాన్ని వివరిస్తూ, ఇందువల్ల వ్యవసాయోత్పత్తులను వీరు స్వాధీనం చేయవలసిన అవసరం లేదని నిర్ణయించినట్లు పేర్కొన్నారు.

నిర్బంధ స్వాధీనపు ఉత్తర్వు వ్యక్తులకు మినహాయించడం చాలా ముఖ్యమైనదని కమ్యూనిస్టుపార్టీకీ, రమవర్గానికీ ప్రజలలో పలుకుబడి పెంచేందుకు శ్రీ కృశ్చేవ్ ఇది తలపెట్టారని పారిస్‌లోని రాజకీయ పరిశీలకులు అంటున్నారు.

ఈవిషయమై 1950 లో యుగోస్లావ్ అధ్యక్షుడు టిటో ముందుగా చర్య తీసికొన్నారు.

### రష్యా ఎలా వ్యవహరిస్తుందో చూడాలి

వాషింగ్టన్, జూలై 6: రష్యా కమ్యూనిస్టు నాయకవర్గంలో వచ్చిన మార్పులపై అమెరికా విదేశాంగశాఖ వ్యాఖ్యానిస్తూ, ఈ మార్పుల ఫలితంగా, అంతర్జాతీయ వ్యవహారాలలో, ముఖ్యంగా నిరాయుధీకరణ, జర్మనీ ఏకీకరణల విషయంలో రష్యా ఎలా వ్యవహరిస్తుందో చూడ్డం అవసరం అని చెప్పింది.

ఈ సమస్యలు న్యాయంగా పరిష్కారం కావడానికి రష్యా ఎలా తోడ్పడుతుందో చూడ్డం అవసరం.

శాంతి వ్యాపింప చెయ్యడానికి, వైరమ్ములు ఉద్భవిస్తూ ఉన్న ప్రాంతాల్లో స్థిరత్వం చేకూర్చడానికి రష్యా ఏవిధంగా వ్యవహరిస్తుందో గమనించాలి. ముఖ్యంగా పశ్చిమాసియా వ్యవహారాల విషయంలో ముందే తెలుస్తుంది.

అసలు ఈ మార్పులవల్ల ఏం జరుగుతుందో ఇంకా చూడ్డం అవసరం, అని విదేశాంగశాఖ వ్యాఖ్యానించింది.

### ఘనాప్రధాని భారత చైనాలపర్యటన

లండన్, జూలై 6: ఘనా ప్రధాన మంత్రి డా॥ న్క్రూమా త్వరలో భారతదేశం, పాకిస్తాన్, బర్మా, సిలోన్ చైనాలుకూడా పర్యటించ దల్చుకున్నారని ఇవాళ పత్రికా సమావేశంలో తెలియపరిచారు.

లండన్‌లో శ్రీ నెహ్రూను కలుసుకోడం తనకు అపూర్వ అనుభవంగా తోచిందని శ్రీ న్క్రూమా అన్నారు.

దక్షిణాఫ్రికా విదేశాంగమంత్రి శ్రీ లవ్ గ్రోవ్ విందుస్వీకరించినవిషయమై విలేఖరుల ప్రశ్నలకు జవాబిస్తూ, విందు సమయంలో వానలూ సభ్యాలతో సహా సర్వవిషయాలూమాట్లాడామని చెప్పారు.

శ్రీ న్క్రూమా పత్రికా సమావేశంలో వివాద విషయాలపై మాట్లాడలేదు. ఆఫ్రికా తన విశిష్టతను వృద్ధిపరచుకోవాలని తన అభిలాష అన్నారు. ఆఫ్రికా తన మనస్సు తానే ప్రకటించు చెయ్యవలసిన సమయం వచ్చిందని, ఇంక ఇతరులను తన తరఫున మాట్లాడనివ్వరాదు, అన్నారు.

స్వతంత్ర ఆఫ్రికన్ రాజ్యాలసమావేశ కార్యక్రమం సాగించ దల్చుకున్నట్లు శ్రీ న్క్రూమా చెప్పారు. ఇప్పటికి తన ఆహ్వానాన్ని ఈజిప్టు, ఇథియోపియా, లైబీరియా, సూడాన్, మొరాకో, ట్యునీషియా, లిబియాలు మొత్తం ఏడు రాజ్యాలు స్వీకరించాయని చెప్పారు.

సమావేశం ఎప్పుడు జరుగుతుందో ఏ యే విషయాలు చర్చిస్తారో తరువాత నిర్ణయమౌతాయి.

దక్షిణాఫ్రికా ప్రభుత్వానికి కూడా ఘనా ఆహ్వానం పంపింది. వలసదేశాలను పరిపాలించే ప్రభుత్వాలను కూడా ఆహ్వానించాలని, ఆ ప్రభుత్వం జవాబిచ్చింది. కాని తాను సమావేశానికి హాజరౌతుందో లేదో తెలపలేదు. దక్షిణాఫ్రికా పంపిన జవాబు ప్రతులను, ఆహ్వానాలు స్వీకరించిన రాజ్యాలకు అందచేసినట్లు శ్రీ న్క్రూమా చెప్పారు.

ఆంధ్ర పత్రిక
సారస్వతానుబంధం

1957 సం॥ జూలై 7-వ తేదీ ఆదివారం

## గ్రంథ పరిచయం

# 'దారుణ భావనల చిత్రణం' - చివరకు మిగిలేది

దక్షిణ భాషా పుస్తక సంస్థవారి ప్రోత్సాహంతో దక్షిణ ప్రాంతంలోని భాషలలో మొదట ప్రచురితమైన పుస్తకాలలో "చివరకు మిగిలేది" (బుచ్చిబాబు రచించినది, ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ, మూల్యం రూ 2-75) ఒకటి. దక్షిణ భారతంలోని తమిళ, తెలుగు, మళయాళ, కన్నడ భాషలలో "విద్యా సాంస్కృతిక వికాసాలకు దోహదమిచ్చే ఉత్తమ గ్రంథాలను చౌకగా ప్రచురింప చేయా"లనే సంకల్పంతో ఫోర్డ్ సంస్థవారు ఒక కార్యక్రమం రూపొందించి ప్రారంభించారు. ఈ సంస్థ ఉత్తమమైన ఆశయంతో ఉదారమైన తలంపుతో ప్రారంభించిన ఈ కార్యక్రమం ఎంతవరకు సఫలం కాగలిగేది ప్రధానంగా ఆ సంస్థ ప్రోత్సాహంతో ప్రచురితం అయ్యే పుస్తకాలమీదనే ఆధారపడి ఉంటుంది. కార్యక్రమం ప్రారంభమైన ఈ సమయంలో 'తొలి కానుక'లు ఆ ఉత్తమ ఆశయసిద్ధికి ఎంతవరకు తోడ్పడగలిగేది నిర్ణయించడం ఉచితం. అంతే కాదు. ఈ ఉత్కృష్టమైన కార్యక్రమ సాఫల్యం కాంక్షించేవారి కర్తవ్యంకూడా అయి ఉన్నది.

దానితోపాటు నవల రచించడంలో రచయిత లక్ష్యంకూడా ఎంతవరకు నెరవేరినది నిర్ణయించడం అవసరం. 'జీవితంపై ఒక దృక్పథం కలుగచేయా'లన్న ఉద్దేశంతోనే ఈ రచన సాగింది. "ఆర్థిక, సాంఘిక, చారిత్రిక వ్యత్యాసాల కతీతమై, మనిషిని మనిషిని స్నేహపాశంలో బంధించివేసే మానవత్వం ముక్కచెక్కల్ని తరచి చూచినప్పుడు, ఆ దృశ్యాన్ని రచయితతో అనుభవించగలం. కాని ఆ అనుభవాన్ని మాటల్లో చెప్పలేం. ఈ జీవిత రహస్యం, దాన్ని తెలుసుకోడానికి మానవుడు చేసే యత్నం-ఏ గొప్ప గ్రంథానికి అయినా ఇది పునాది ఈ నవలకీ అదే పునాది" అని రచయిత చెప్పుకొన్నాడు.

ఒక గ్రంథం గురించి విపులంగా చెప్పడం దానికి ప్రాధాన్యం ఇవ్వడం కాగలదు. అయినా ఈనాడు ప్రముఖ రచయితగా ప్రచారంలో ఉన్న బుచ్చిబాబు రచించిన 'చివరకు మిగిలేది' గురించి విపులీకరించడం ఆ నవలను దక్షిణ భాషా పుస్తక సంస్థ ప్రచురించడంవల్ల అవసరం అయింది. అది ఈ గ్రంథానికి లేని ప్రాధాన్యం ఆపాదించకపోతే చాలు పఠితకారుడు సంతృప్తి చెందగలడు.

'చివరకు మిగిలేది' లోగడ పుస్తకరూపంలో వెలువడినది. దానినే సంక్షిప్త పరచి దక్షిణ భాషా పుస్తక సంస్థవారు ఈనాడు మనకు అందచేశారు. బుచ్చిబాబు చాల కథలు, నాటికలు రచించారు. వాటిలో చాల పుస్తకరూపంలో వెలువడినవి. 'ఉత్తమ గ్రంథాల' ఎన్నికకు ప్రాయశః ఇట్టి ప్రాముఖ్యమే గీటురాయిగా ఉండి ఉండవచ్చు. 'చివరకు మిగిలేది' ఎన్నుకొనడానికి అంతకుమించిన ప్రాధాన్యము, వైశిష్ట్యము ఆపాదించడం కష్టం.

నవలలో ఇతివృత్తం సంక్షిప్తంగా ఇది: దయానిధి వైద్యం చదువుతున్న కాలంలో కోమలిని కామించాడు. పందు లక్ష్యంకాగానే విడిచిపెట్టాడు. తల్లి మృతి చెందిన తరువాత తండ్రి మాటమీద ఇందిరను వివాహం చేసుకొన్నాడు. ఇందిరతో ఏనాడూ వైవాహిక జీవితం గడపలేదు. చదువు పూర్తి అయిన తరువాత ఏలూరులో 'ప్రాక్టీసు' పెట్టాడు. సంఘంచేత బాధలుపడ్డాడు. ఏకాంత వాసంలో ఉండగా అమృతం వచ్చింది. ఆమెను అనుభవించాడు. పనిజానికి భయపడి రాయలసీమకు పారిపోయాడు. అక్కడ పట్టణం దొరికినది. ప్రాముఖ్యంలోనికి వచ్చాడు. గొప్పవాడు కావడానికి పరిస్థితులు ప్రతికూలించినవి. ఈలోగా కోమలి వెదకుతూ వచ్చింది. అతనివద్దనే స్థిరపడిపోయింది. ఇందిర చనిపోయింది. పరిస్థితుల ప్రాబల్యంవల్ల కోమలిని వివాహం చేసుకొనడానికి నిశ్చయించుకొన్నాడు. చివరికి సర్వమూ నాశనం కాగా రాయలసీమ విడిచి పోయాడు.

నవలలో దయానిధి, కోమలి మధ్య నడచిన వ్యవహారం అత్యంత ప్రధానమైనది. దయానిధి కోమలిని కామించాడు. కేవలం ఆమె శరీరమే కామించాడు. ఆమెను ప్రేమించలేదు. ఆమె ప్రేమను కాంక్షించలేదు. ఆమె ప్రేమించగలదనే నమ్మకం అతనికి ఏనాడూ లేదు. దయానిధి ఈ ప్రకృతిపరించి రచయిత భావాలను అనుసరణంగా

సౌఖ్యాలంటే దయానిధి శరీరంలేని ప్రేమను ప్రేమించాడు. ప్రేమలేని శరీరం కామించాడు. ఈ రెంటికీ సమన్వయం కుదరలేదు. అతడు అట్టి సమన్వయంకోసం ప్రయత్నించనూ లేదు.

దయానిధి ప్రకృతిలో మరొక విచిత్రం ఏమంటే అతడు కామించినమాట వాస్తవమే. అయినా అనుభవించాలని కోరలేదు. కనుకనే, కోమలి మొదట్లోనే లభ్యం అయినప్పుడు ఆమెను అనుభవించకుండా విడిచిపెట్టాడు. దూరంగా ఉన్నంతకాలం మాత్రమే కామిస్తూ, ఆలోచనలతో గడపగలిగిన ఆత్మస్థైర్యం దయానిధికి ఉన్నది. కామించకపోయినా సుశీల దగ్గరికివస్తే కాదనలేని మెత్తని హృదయం. దీనికి అమృతం ఉదంతం తార్కాణం.

కోమలి విషయంలో దయానిధి చివరివరకు ఒక విధంగానే ఉన్నాడు. రాయలసీమలో ఉన్నప్పుడు కోమలి తిరిగి వచ్చినది. ప్రేమించిందో లేదో తెలియదు. నిశ్చయంగా అతనిని కామించినది. అప్పుడూ అతడు కోమలిని స్వీకరించలేక పోయాడు.

దయానిధి జీవితంవంటిదే కోమలితో వ్యవహారం. పుట్టి పెరిగిన ఊళ్లో ఉండలేదు దయానిధి. ప్రాక్టీసు పెట్టుకొన్న ఊళ్లో ఉండలేకపోయాడు. రాయలసీమకు పారిపోయి జీవితం తిరిగి ప్రారంభిస్తే అక్కడివారు ఉండనివ్వలేదు. కోరికలకు వాస్తవానికి పొత్తు కుదరక దయానిధి రెంటికీ చెడ్డరేవడివలె తయారు అయ్యాడు.

మొదట కోమలి లభ్యంఅయినప్పుడు దయానిధి వైఖరి ఏమిటో చివర ఆమెమీద పడ్డప్పుడుకూడా అతని వైఖరి అదే. ఈనడుమ 'విష్కంభం'లో పడిన చినగాథ అంతా వస్తుతః అతనిలో చెప్పుకోదగిన ఎట్టి మార్పు తీసుకొని రాలేకపోయినది. అయినప్పుడు మొదటి సంఘటనతో నవల విడిచిపెట్టి ఉంటే రచయితకు శ్రమ, పాఠకునికి ప్రయాస తగ్గి ఉండునని తోస్తుంది.

ఇక అమృతం విషయం వేరు. ఆమె ఒక పరిస్థితిలో దయానిధికి అవసరం అయింది. దయానిధికి కోమలి వ్యవహారంలో సహాయం చేసింది. ఆమే దయానిధిని కామించింది. బలమైన ఆమె వాంఛ అతనిని లొంగదీసుకొంది. అనేక అమృత కుడియ. అమృతం గర్భం ధరించింది. అంతటితో ఆమెకు దయానిధిపై ఉన్న కాంక్ష అంతా నశించింది. దయానిధికి ఒక సమస్య పరిష్కారం అయిపోయింది.

దయానిధికి ఇందిరతో ఉన్న సంబంధం అపోకరకం. అసలు సంబంధమే లేదు. వివాహం అనేది అసవసరంగా సంబంధం కల్పించడానికి చేసిన ప్రయత్నం సఫలం కాలేదు. కోమలిని కామించినవాడు ఇందిరను కామించడం సంభవం కాదు. ప్రేమలేకనే వివాహం చేసుకొన్నాడు కనుక ప్రేమించనూ లేదు. ఆమె క్షయ వ్యాధితో చచ్చిపోయి అతనికి ఏవిధమైన అడ్డంకీ— తిరిగి పెండ్లి చేసుకొనడానికి-లేకుండా చేసినది. ఆమె చనిపోయినప్పుడు సహజంగానే అతనిహృదయం చలించనే లేదు. ఆమె వివాహానికిముందు ఒక విధంగా ప్రేమించినది. చనిపోయేముందు ఆమెహృదయం ఎముకలగూడులోంచి "నన్ను విడిచి వెళ్లకండేం" అంటూ నిరసంగా చేసిన ఆక్రోశంకూడా అతని విషయంలో నిరర్థకం అయింది.

సుశీల అనే మరొక అమ్మాయి ఈ మధ్యలో దయానిధి జీవితంలో ప్రవేశించబోయింది. దయానిధి ఆలోచన ప్రకారం ఆమె అసలు ప్రేమించలేని మనిషి. అయినా ఆమె తన జీవితంలో అడుగుపెట్టకూడదని దయానిధి బలంగా కోరుకోవలేదు. ఆమే అడుగుపెట్టకుండా ఉండిపోయినది. తద్వారా మరొక సమస్య పరిష్కారమార్గం లభించినది.

పరిష్కారం కానిదల్లా కోమలి సమస్య. దానితో చివరికి సమాధాన పడ్డాడు దయానిధి.

దయానిధి కామవాంఛలు, ప్రేమ వాంఛలు గురించి స్వల్పంగా చెప్పడం అవసరం. చదువుకునే కాలంలో, పరిపక్వం చెందుతూన్న దశలో, యౌవనం తొలిసారి విజృంభిస్తూన్న సమయంలో బాలురు రకరకాల ఊహలకు, వాంఛలకు లోనవుతారు. అంతా అస్పష్టంగా మసకమసకగా ఉంటుంది. ఏదీ ప్రత్యేకంగా కోరదగినదిగా కనిపించదు. ఆ దశలోని ఊహలే దయానిధి ఆలోచనలపరంగా మనకు కనుపిస్తు ఉన్నాయి.

కామం విషయం కొలదిసేపు విస్మరించి దయానిధి ప్రకృతి, నీతి గురించి చర్చిస్తాను. ఒకరాత్రి దయానిధితో గడపడానికి కోమలి పది రూపాయలు అడిగింది. ఆమెతో ఉండకుండానే ఏదైతే రూపాయలు ఇచ్చిన ఔదార్యం దయానిధిది. ఆ సొమ్ము అతనిది కాదు. చిన్నప్పుడు ఎప్పుడో దయానిధి చూచిన పిల్ల, ఈనాడు అతనిని కామిస్తున్న యవ్వనవతి అమృతం పెట్టుబడి పెట్టిన సొత్తు. అమృతంతో మధురఘడియ గడిపిన తరువాత తిరిగి ఆమె ముఖం చూడలేక పలాయన మంత్రం పఠించాడు దయానిధి. అప్పుడు ప్రయాణానికి కూడా తనకు తెలియకుండానే అమృతమే పెట్టుబడి పెట్టింది. అలా తనను కామించిన స్త్రీ పెట్టుబడి పెట్టిన సొమ్ము తీసుకొనడానికి దయానిధికి అభ్యంతరం లేదు. చేసుకొన్న భార్య తండ్రి పంపిన నూరు రూపాయలు తీసుకొనడానికి మాత్రం పాపం! అవరోధాలు అడ్డు తగిలాయి. అయితే అమృతం బాకీ వడ్డీ లేకుండా తీర్చివేశాడు దయానిధి.

సుశీలను దయానిధి మిత్రుడు కామించాడు, ఒక విధంగా ప్రేమించాడు. సుశీలను అతడు వివాహం చేసుకుంటానన్నాడు. ఆమె ప్రేమించలేని వ్యక్తి అని మిత్రునికి బోధించడం తన కర్తవ్యంగా భావించుకొని దానిని నెరవేర్చాడు దయానిధి.

దయానిధికి తల్లివంటి వ్యక్తి మరిలేదు. "కోమలితో సంపర్కం బాధ అమ్మకు తెలుసు……తప్పని దండించదు, సహిస్తుంటుంది," తల్లి పట్ల కృతజ్ఞత కలిగి ఉండడానికి ఇది కారణం అయినది. అట్టి తల్లి గురించి కుమార్తెమానం అమ్మకొని జీవించే ఒక స్త్రీ, ఇతరులు అనే మాటలు నమ్మడానికి దయానిధి ఒక్క క్షణం అనుమానించడు. తల్లిని తండ్రి హత్యచేశాడని నమ్మడానికికూడా ఇతరులు అనే మాటలు, స్వీయభావనాబలం చాలు. అంతగా ఇతరుల మాటలు వినడం ఒక విశిష్టత. దయానిధికి కులం అడ్డువస్తుంది. "కోమలి ఆ కులంలో ఎందుకు పుట్టాలి? తల్చుకుంటే భయం వేస్తుంది," అనుకుంటాడు.

ఇక దయానిధిమీద పరిస్థితుల ఉన్న ప్రాబల్యం అధికం. తండ్రిమాటమీద ఎట్టి అభ్యంతరమూ చెప్పకుండా వివాహంచేసుకొన్నాడు. తరువాత కాపురం చేసుకొనడానికి కూడా వెళ్ళాడు. కాని రాజకీయాలరూపంగా పరిస్థితులు అడ్డు తగిలాయి. ఏలూరు విడిచి పారిపోవడానికి పరిస్థితులు కారణమైనవి. తిరిగి రాయలసీమ విడిచి పోవడానికి కూడా పరిస్థితులే కారణమైనవి. పరిస్థితులను ఎదిరించడానికి దయానిధి చేసిన ప్రయత్నం మాత్రం శూన్యం. పరిస్థితులను ఆడిపోసుకొనడానికే అతనికి తీరికఉన్నది. కాని వాటిని ఎదిరించడానికి ప్రయత్నించడమనే తలంపులేదు.

భావనావీధిలో ప్రవేశిస్తే అంతా అయోమయం. కోమలిని కామించడమనేది హృదయం ఉన్నవారు చేసే పని. అలాంటి హృదయం ఉన్నవాళ్ళను సంఘం దూషిస్తుంది అనుకుంటాడు. కోమలిని కాంక్షించేవానికి అందరూ డబ్బు ఇస్తే దయానిధి దృష్టిలో సంఘం స్వర్గంగా మారిపోగలదు. "జీవితంలో వ్యక్తిగతమైన ఇబ్బందులు ఉన్నవారికి ఈ రాజకీయాలు ఒక అదర్శం-పరమావధి." "ఏ మనిషీ తన ఉద్దేశాలను, వ్యక్తిత్వాన్ని భవిష్యత్తుకు అంకితం చేసుకోలేడు," ఇవి మచ్చు తునకలు.

అమృతంతో గడిపిన మధురఘడియను గురించి ఆలోచిస్తూ "ఏ ఇద్దరువ్యక్తులు అయినా ఆ పరిస్థితులలో అల్లాచేసి తీరతారు" అని సిద్ధాంతీకరిస్తాడు దయానిధి. అదే దానికి సమర్థన. "అహం, వ్యక్తిత్వం, స్వార్థం, నేను అనే చైతన్యం (ఈభావం అహం అనే ప్రకృతికి భిన్నమైనది కాబోలు!) అన్నిటిని నాశనంచేసే మహత్తర అనుభవం…" అంటూ దాని ఫలితంతో నిమిత్తం ఎందుకు అని ప్రశ్నిస్తాడు దయానిధి. ఊరుకోక "కాని సంఘానికి ఫలితాలు కావాలి" అని వాపోతాడు.

నవల మొదటినుంచి చివరివరకు ఇదే విధంగా సంఘాన్ని తలపెట్టి వాపోవడము, విమర్శించడము, దాడిచేయడము సాగిస్తూనే ఉంటాడు దయానిధి. దయానిధి తన బాధలు అన్నిటికి సంఘమే బాధ్యత వహిస్తుందంటాడు. సంఘంమీద విపరీతమైనద్వేషం పెంచు

(8 వ పుట చూడుడు)

# సరళ సంస్కృతం

## పాఠము 27

### భవిష్యత్కాల ధాతువులు

(1) గమ్-వెళ్లు

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర | (సః) (వాడు) గమిష్యతి-వెళ్లగలడు | (తే) గమిష్యన్తి-(వారు) వెళ్లగలరు. |
| మ | (త్వమ్) గమిష్యసి-(నీవు) వెళ్లగలవు | (యూయమ్) గమిష్యథ-(మీరు) వెళ్లగలరు. |
| ఉ | (అహమ్) గమిష్యామి-(నేను) వెళ్లగలను | (వయమ్) గమిష్యామః-(మేము) వెళ్లగలము |

| ధాతువు | భవిష్యత్కాలము | అర్థము |
|---|---|---|
| (2) పిబ్-త్రాగు | పాస్యతి | త్రాగగలడు |
| (3) పఠ్-చదువు | పఠిష్యతి | చదవగలడు |
| (4) దృశ్-చూచు | ద్రక్ష్యతి | చూడగలడు |
| (5) క్రీడ్-ఆడు | క్రీడిష్యతి | ఆడగలడు |
| (6) వద్-చెప్పు | వదిష్యతి | చెప్పగలడు |
| (7) అస్ / (8) భూ - ఉండు | భవిష్యతి | కాగలడు |
| (9) కృ-చేయు | కరిష్యతి | చేయగలడు |
| (10) ధావ్-పరుగెత్తు | ధావిష్యతి | పరుగెత్తగలడు |
| (11) పత్-పడు | పతిష్యతి | పడగలడు |
| (12) లిఖ్-వ్రాయు | లేఖిష్యతి | వ్రాయగలడు |
| (13) ఖాద్-తిను | ఖాదిష్యతి | తినగలడు |
| (14) అట్-తిరుగు | అటిష్యతి | తిరుగగలడు |
| (15) అర్చ్-పూజించు | అర్చిష్యతి | పూజించగలడు |
| (16) ఖేల్-ఆడు | ఖేలిష్యతి | ఆడగలడు |
| (17) చల్-కదులు | చలిష్యతి | కదలగలడు |
| (18) క్రీ-కొను | క్రేష్యతి | కొనగలడు |
| (19) స్థా-ఉండు | స్థాస్యతి | ఉండగలడు |
| (20) ఆగచ్ఛ్-వచ్చు | ఆగమిష్యతి | రాగలడు |
| (21) (వి)క్రీ-అమ్ము | విక్రేష్యతి | అమ్మగలడు |
| (22) సించ్-తడుపు | సేక్ష్యతి | తడపగలడు |
| (23) రోహ్-మొలకెత్తు | రోక్ష్యతి | మొలకెత్తగలడు |
| (24) వర్ష్-వర్షించు | వర్షిష్యతి | వర్షించగలడు |
| (25) రచ్-రచించు | రచయిష్యతి | రచించగలడు |
| (26) వస్-ఉండు | వసిష్యతి | వసించగలడు |
| (27) ని + వస్-నివసించు | నివసిష్యతి | నివసించగలడు |
| (28) కృష్-దున్ను | క్రక్ష్యతి | దున్నగలడు |
| (29) నీ-తీసికొనివెళ్లు | నేష్యతి | తీసికొనివెళ్లగలడు |
| (30) ధార్-ధరించు | ధారయిష్యతి | ధరించగలడు |
| (31) కథ్-చెప్పు | కథయిష్యతి | చెప్పగలడు |
| (32) క్షాల్-కడుగు | క్షాలయిష్యతి | కడగగలడు |
| (33) పాల్-పాలించు | పాలయిష్యతి | పాలించగలడు |
| (34) తోల్-తూచు | తోలయిష్యతి | తూచగలడు |

శ్లో॥ ఉదారస్యతృణం విత్తం శూరస్య మరణం తృణమ్
విరక్తస్య తృణం భార్యా నిస్పృహస్య తృణం జగత్॥

అన్వయము:-ఉదారస్య విత్తం తృణం (భవతి) శూరస్య మరణం తృణం (భవతి) విరక్తస్య భార్యా తృణం (భవతి) నిస్పృహస్య జగత్ తృణం (భవతి)

భావార్థము:-దానముచేయు స్వభావముకలవానికి ధనము గడ్డిపోచవంటిది. వీరునకు మరణము తృణప్రాయము. విరాగికి భార్య గడ్డిపోచవంటిది. ఏ కోరికా లేనివానికి ప్రపంచమే గడ్డిపోచతో సమానము.

### లోకోక్తి

అలబ్ధలాభో నాలసస్య
పదవిభాగము:-అలబ్ధలాభః, న, అలసస్య
అన్వయము:-అలసస్య అలబ్ధలాభః న-సోమరికి అపూర్వమైన లాభము కలుగదు.

సూచన:-పైన 'గమ్' ధాతువునకు భవిష్యత్కాలములో రెండు వచనములలోను మూడు పురుషులలోను గల రూపములను చూచి వానివలెనే తక్కిన 33 ధాతువులకు అన్ని రూపములను వ్రాసికొని అర్థమును గ్రహించి ఈ భవిష్యత్కాల ధాతువులతో క్రొత్త వాక్యములు నిర్మించుట నభ్యసింపుడు. వెనుక చెప్పిన వర్తమానకాల క్రియలను ఈ క్రియలముందు వ్రాసికొని రెండింటికి గల భేదమును బాగుగా గుర్తింపుడు.

[సంస్కృత విశ్వపరిషత్తు ప్రేరణతో భారతీయ విద్యాభవన్ నిర్వహిస్తున్న సరళసంస్కృత పరీక్షలకోసం ప్రచురించిన పాఠాలకు అనుగుణంగా శ్రీ సుదురుమాటి వెంకటరమణశర్మ, శ్రీ తొయ్యేటి భానుమూర్తి (సంయుక్త కార్యదర్శులు ఆంధ్రప్రదేశ విద్యాపరిషత్తు - సూర్యారావుపేట, విజయవాడ-2) వ్రాసిన పాఠములు. వివరములు కోరువారు తగు పోస్టుబిళ్లలు పంపవలయును.]



దక్షిణధ్రువ హిమక్షేత్రంలో—భూమి అడుగున ఒక పరిశోధనాలయం—మంచు భూమిమీద కనపడేవి, ఉషాజ్యోతిని, వాయుద్యుతిని పరిశీలించడానికి పెట్టిన దుర్భిణీయంత్రాలు, దూరదర్శినియంత్రాలు.

# పాతాళంలో 133 రోజులు

## మంచురక్కసితో పోరు

'అట్కా' అనే హిమచ్ఛేదక నౌక ఉత్తర దక్షిణ ధ్రువాలలో సంచరిస్తూ భూవిజ్ఞాన శాస్త్ర పరిశోధకులకు అనేక అనావిష్కృత రహస్యాలను గ్రహించుకొనడంలో తోడ్పడుతోంది. 'విజ్ఞాన సముపార్జనకు ఎంత కష్టపడాలో, ఎందరి సహాయం కావాలో, తీరా ధ్రువహిమ రాక్షసిలాగా అది ఎంతగా అంతుపట్టనిదో,' 'అట్కా' నౌకాధిపతి కమాండర్ గ్లెన్‌జాకొబ్‌సెన్ అనుభవాలు తెలియచేస్తాయి. ఇది జాకొబ్‌సెన్ దినచర్యకు భూమిక లాంటిది మాత్రమే. దీని తర్వాత దినచర్యను ప్రచురిస్తాము.

నౌకాదళ హిమచ్ఛేదక నౌక 'అట్కా' దక్షిణధ్రువయాత్రను ముగించుకొని, 133 రోజులతర్వాత, బోస్టన్ రేవు ఆవరణలోకి చేరుకుంది. నాడు 12 ఏప్రిల్ 1955. ధ్రువప్రాంగణంలోని హిమఖండాలను నుగ్గునుగ్గుచేసి తిరిగి వచ్చిన 'అట్కా' బోస్టన్‌ను చూచేసరికి అలిసినట్లు కూయసాగింది. ఆ కూతవిని, రేవు వద్దవేచుకొనిఉన్న ప్రజానీకం— 'అట్కా' ఉద్యోగుల తల్లులు, పిల్లలు, భార్యలు, మిత్రులు—ఎంతో ఉప్పొంగిపోయి ఉంటారు. అందరూ కలిసి గొంతెత్తి పాడుతున్నారు, ఆనందపారవశ్యంతో—"ఇంటికి రా నావెంట—కంటికి కానరిదోవల—వెంటనే ఇంటికి పోదాం."

గ్లెన్ జాకొబ్‌సెన్

దక్షిణధ్రువానికి 689 నాటికల్ మైళ్ళ (మైలుకు 6076.097 అడుగులు) సమీపానికివెళ్లాం-మళ్లీ అనుకున్న కాలానికి తిరిగిరాగలుగుతామా లేదా అని అప్పుడప్పుడూ భయపడుతూ ఉండేవాడిని-అనేకసంఘటనలు జరిగాయి ఆయాత్రలో - ఓడముందుభాగంలో నిలచి ఆ ప్రజవాన్ని, బోస్టన్ రేవుచూసేటప్పటికి, గతమంతా స్మృతిపథంలో జరజరలాడుతూ పునశ్చరణ కాసాగింది.

### అర్థరాత్రి సూర్యరస్మిలో

ఒకనాడు, అర్థరాత్రి సూర్యరస్మిలో—నూల్జ్‌బర్గర్ అఖాతంలో మంచుగడ్డను ఛేదించుకొని ముందుకు సాగడానికి తంటాలు పడుతున్నాము. హిమఖండాన్ని బద్దలుకొట్టుకొని సాగిపోతామా లేక అందులోనే నగలో వజ్రంలాగా, పాదుకొని పోతామా అనే శంక కలిగింది. అందుబాటులో ఎక్కడా సహాయం లభించే ఇరవు కూడా లేదు. అదృష్టవశాత్తూ ఆహిమఖండాన్ని చీల్చుకొని పోగలిగాం-లేకుంటే మమ్మల్ని ఆహిమఖండం తనలో పొదిగివేసుకొనేది-మళ్లీ 1956 దాకా దాన్ని ఛేదించుకొచ్చేవారు ఉండేవారు కారు.

అంతకు ఐదారునెలలకు ముందు ఉత్తర ధ్రువానికి (ఆర్కిటిక్) పోయి వస్తున్నాం. 'అట్కా' ధ్రువాల్లోనే పనిచేస్తూ ఉంటున్నది. మా ఓడకు ఒక నిర్ణీత భవిష్యత్తు ఉన్నట్లు లేదు. ఉత్తరధ్రువయాత్ర తర్వాత 'అట్కా' కూ దానిసిబ్బందికీ ఇక హిమక్షేత్ర యాత్రలుండవనీ, సామాన్య నౌకాబలంలో వారిని చేర్చుకుంటారనీ పై అధికార్లు చెప్పారు. అదలా ఉంచండి. 'అట్కా' తిరిగి వస్తుండగా ఒకపెద్ద మంచుగడ్డ—కొండంతది-ఎదురుపడింది. నా తర్వాత ఉద్యోగి, కమాండర్ జాన్ లానా అనుమతితో, ఆ మంచుగడ్డను పగలకొట్టుకొని ముందుకుసాగాలని ప్రయత్నాలు చేశాడు. అంతే. దాన్ని ఛేదించి, దానిముక్కల మధ్యనుంచి ప్రయాణంచేశాము. స్వదేశానికి చేరుకున్నాం. తీరా "అట్కా" మామూలు నౌకాదళంలో చేరదనీ, భూవిజ్ఞాన పరిశోధనలకే అంకితమై, నాయకత్వానే పనిచేస్తూ ఉంటుందనీ, ఉత్తరువులు జారీ అయినాయి! తర్వాత నూల్జ్‌బర్గర్ అఖాతంలో మంచుఖండాల్లో తంటాలు పడ్తుంటే ఒక నావికుడువచ్చి "అప్పుడు, ఉత్తరాన, ఆ మంచుకొప్పను ముక్కలు చేశాం కదూ! చివరసారి అన్నారు!" అని గుర్తుచేశాడు, నవ్వుతూనే.

ఆర్కిటిక్ (ఉత్తరధ్రువం) నుంచి వచ్చి ఏడునెలలయింది. ఈలోగా అంటార్కిటిక్ (దక్షిణధ్రువం) కూడా సందర్శించివచ్చాం. ఒక్క దక్షిణ ధ్రువం ఏమిటి — హిందూ మహాసముద్రంతప్ప, సమస్త సముద్రాలన్నీ తిరిగాం-మొత్తం 27000 నాటికల్ మైళ్లు —అంటే భూమి చుట్టుకొలతకు రెండువేల మైళ్లు ఎక్కువ. హిమఖండాలను ఛేదించడంలో 'అట్కా' జంట ప్రొపెల్లర్లలో (తోపుఇచ్చే చక్రాలు) ఒకటి దెబ్బతింది. మిగిలిన ప్రొపెల్లర్ సహాయంతోనే ప్రయాణంసాగించాం.

### పాతాళ వర్ణన

అంటార్కిటికాలాంటి ప్రదేశం ప్రపంచంలోమరెక్కడా లేదు. కథల్లో వర్ణించిన మాంత్రికురాలు లాంటిది—ఆకర్షణీయమైన రక్కసి-అందమైనబో-మాడలిగొట్టేది! ఆకర్షించి, విసిరికొట్టుంది. రమ్మని పిలుస్తున్నట్లుంటుంది—రప్పించి రుద్రభూమికి లాక్కెళ్తుంది. థామస్ హెన్రీ, జాన్ సెల్‌డన్ గైవర్, రసెల్ ఓవెన్ మొదలైన రచయితలు, ఈ క్షేత్రాన్ని, శ్వేతఖండమనీ, తెలివిడాని అనీ, తెల్లగోడ అనీ వర్ణించారు. పరిశోధకయాత్రికుడు డగ్లస్ మాసన్ ఇది శ్వేతఖండం కాదనీ, చిత్రవర్ణ ప్రపంచమనీ అన్నాడు. అవును. అది చిత్రవర్ణక్షేత్రమే. దక్షిణధ్రువాకాశంలో కన్పించే రంగుల ముందు ఇంద్రధనస్సు వెలవెలగా ఉంటుంది-ఆ రంగుల నిర్దుష్టత, వాటి కలయికల సొంపు, అవి దాల్చే రూపాలసోకు, వర్ణనాతీతం. ఇక మేఘాల తీరులు చెప్పవలసినేకాదు. అవి గంధర్వ నగరాలు కదా! ఆరునెలల పాటుసూర్యుడుకనపడుతూనేఉంటాడు. ఒకొక్కప్పుడు సూర్యుని చుట్టూ పొరలు పొరలుగా చిత్ర విచిత్ర వర్ణాలలో వలయాలు ఏర్పడతాయి. మిగిలిన ఆరు నెలలూ రాత్రి-ఆ రాత్రికి రాణి శశి-అనేక కళల్లో, పరిసరాలలో కనుపిస్తూ ఉంటుంది. ఇక ఎండమావులకు కొదువలేదు. కంటికి కానరాని ఒక దూర ప్రదేశం ఆకాశంలో ప్రతిబింబించి, సన్నిహితంగా కనపడుతుంది. హిమఖండాలు తొరంతవి-చాటుఅంతవి, మంచుగడ్డ అటకలు-ఎక్కడ చూసినా అవే. మా ఓడ చాలా దార్ఢ్యం కలది. అయినా ఆ అటకలు విరిగిపడినప్పుడు, అంత ఓడకూడా అట్టిట్టయ్యేది.

ఇక ఆ హిమనదాల కల్లోల ప్రవాహాలు కరుడుకట్టుకుపోతున్న శిల్పఖండాల జాలం. ఎన్ని కళ్లు ఉంటే అన్ని విధాలుగా కనపడ్తాయి. ఆ మంచు వివిధ అవతారాలు ఎత్తుతుంది — ప్రాసాదాలు—చర్చిలు—కోటలు — దేవకుండి రాలు — పక్షి ముఖాలు — కాకీలాడే పటాలం—విచిత్ర జంతు సందోహం — పెంగ్విన్ నాట్యం — రాక్షసగణం—ఇన్ని రకాలుగా గోచరిస్తుంది. ఫెళఫెళార్భాటాలతో బద్దలయ్యే హిమఖండాలు, నవ్వుతూ, సంగీతం పాడుతూ, సంరంభం చేసుకుంటూ, రోజుకుంటున్నట్లూ, కుకాకి పేల్చినట్లూ, నిట్టూర్పుతున్నట్లూ, ఒక హిమఖండపరిమాణానికి ఒక హిమఖండ విచ్ఛేదానికి మరొకటి అట్టహాసమూ, విలాపమూ, చేస్తున్నట్లూ—నానా వీభత్సంగా ఉంటుంది.

నేను ఆర్కిటిక్ చూశాను. అంటార్కిటిక్ సూ చూశాను. కానీ అంటార్కిటిక్ సాటిలేనిది. రెండుచోట్ల హిమఖండాల వటిమా ఒకటే—రెండూ ప్రమాదకరమైనవే. కానీ అంటార్కిటిక్‌లో హిమఖండాలు తేలికగా పగలవు! హిమచ్ఛేదక నౌకకూ హిమఖండాలకూ మధ్య ఏదో దెబ్బ తాకనీయని మెత్తటి పదార్థం ఉన్నట్లుంటుంది! పైగా అంటార్కిటిక్ ఎంతో దూరప్రదేశం. సహాయం సులభంగా రాదు. ఆర్కిటిక్ అయితే అమెరికాకు సమీపం— 400 మైళ్ళ దూరంలో సహాయకేంద్రాలుంటాయి, విమానాలు ఆహారం తెచ్చివేస్తాయి— సాహసిస్తే తప్పించుకోవచ్చు.

### 14 నెలలు హిమారణ్య నివాసమే!

అంటార్కిటిక్‌లో హిమచ్ఛేదక సాగుతున్నంతసేపూ, 'కేజానికి దూరంగా ఉన్నాననుకుంటూ—ఈ లోగా ఈ మంచుఎడారి నిప్పు తనలో పొదిగేసుకుంటుంది' అనే బెంగపడలేదు. జనవరి ఫిబ్రవరి మాసాలు వెచ్చటిరోజులు. ఆ తర్వాత అక్కడి మంచు, ఉక్కులా గడ్డకట్టుకుంటుంది. అందులో చిక్కుకుంటే, మళ్ళీ జనవరి వచ్చే లోగా ఏ సహాయమూరారు. అక్కడికి ఓడలు, ఇక రాలేవు.

పాతాళానికి పోయిన ఓడనావికుని వర్ణన అలా ఉంటుంది. ఒక్క చిన్న తప్పు జరిగిందో, 14 మాసాలు హిమారణ్యవాసమే. 'అట్కా' కు చాలా ప్రమాదాలు సంభవించాయి. నూల్జ్‌బర్గర్ అఖాతంలో ఒకసారి పొరపాటున ఓడలోముఖ్యమైనభాగం ఒకపక్క దెబ్బతింది. బతుక్కి మళ్లాం. ఆ అనుభవం తర్వాత మరీ భయస్తుణ్ణి అయ్యాను. తీరా ఈ ఓడ నమ్మకం కల్గించేటంత బాగా లేదని తిరిగిరానా! పోనీ ముందుకు పోగలమా? మరి ఓడలో 276 మంది నావికులు ఉద్యోగులు శాస్త్రపరిశోధకులు ఉన్నారు. అక్కడ అందరమూ చిక్కడిపోతే, ఉన్న ఆహారం చాలదు. పెంగ్విన్లమాంసం, సీల్ మాంసం తిని ఇన్నాళ్ళు భరించగలరా - మనస్సులు వికలం కావచ్చు-జబ్బులు రావచ్చు - కొందరు చచ్చిపోవచ్చు. అప్పుడు వాళ్ల తల్లిదండ్రులకు భార్యలకూ ఏమని చెప్పుకో? ఎలా ఇలాంటి తప్పుడు నిర్ణయం చేశానని సమర్థించుకోను!

చలి-ముందుకే పోదాం అని నిశ్చయించుకున్నాను. 'అట్కా' బాగానే పనిచేస్తూ నడిచింది. ద్వితీయప్రపంచ యుద్ధంలో కూడా నాకు అంత వ్యాకులం కలగలేదు.

మేము ఆ హిమక్షేత్రాన్ని చూసి, మా పరిశీలనలను వివరించి చెప్పిన తర్వాత, అక్కడ అక్టోబర్ 1955 లో భూవిజ్ఞాన పరిశోధనకోసం తగు కేంద్రాలను నెలకొల్పుతారు.

మా యాత్రకు సైనిక చర్యలతో సంబంధం లేదు. ఇది కేవలం భూవిజ్ఞాన పరిశోధనలకోసం సాగుతున్నది. మా అనుభవాలు ప్రపంచంలో జిజ్ఞాసువులందరి సొమ్మేను.

ఇక యాత్రాకాలంలో మా దినచర్యను తెలియజేస్తాను. ఇప్పటికీ బోస్టన్‌రేవులో మాకోసం కళ్ళు పెట్టుకొని చూస్తున్న మావాళ్ళు…

[జె. కే.]

కథానిక

# కలవనిదారులు

శ్రీ మాగాపు సత్యానందరావు

భాద్రపద మాసం. బహుళ పక్షం. అమావాస్య చేరబడ్డానికి తొందర పడుతోంది. పగటివేళ నెత్తి మాడ్చేటట్టు చిత్త ఎండ కాస్తోంది. రాత్రి పడడం తడవు. ఆకాశం మేఘాచ్ఛాదితమై, ఉరుములు మెరుముల ఫెళఫెళార్భటులతో మింటినీ మంటినీ సంధిస్తూ వంతత ధారాపాతంగా వర్షం కురుస్తోంది. వర్షపాతానికి కటిక చీకటి లయ కలుపుతుంది. వీరాంపురంలో వెంచేసిన విషూచిదేవి విచ్ఛృంఖలంగా సాగిస్తున్న విలయతాండవానికి ఈ వాతావరణం చక్కగా ఒనగూడినట్టుంది. విశ్వనాథం మాష్టారింట్లో ప్రళయకాల కరాళకాళికా నృత్యానికి గజ్జ గట్టింది మహామ్మారి. సంజవేళ మొదలుకొని, తెల్లవారే లోపల నాలుగు నిండు ప్రాణాలను బలిగొన్నది కలరా. అయనకున్న సంతానం ముగ్గురు మగపిల్లలే. ఆడవాళ్ళు లేరు. వారిలో రెండోవాణ్ణి దత్తత కిచ్చారు. మూడోవాడు పాలుప్రాగే పసిపాప. పెద్దవాడు రవి. స్కూల్ ఫైనల్ ప్యాసు కాకపోయినా కొంచెం తెలిసిన వాడే. ఉద్యోగం చేస్తూ చదువుతున్నాడు. వాడి దిష్టాతీ చూస్తే ముత్యాల కోవలాగుండి, ముద్దు పెట్టుకో బుద్ధిపుడుతుంది. క్లాసు మొత్తంలో అందెవేసిన చెయ్యి. ఆటల పోటీలో బహుమతులన్నీ వాడివే. ఎక్కడుంటే అక్కడ ఇట్టే ఇల్లోకలా చుట్టుప్రక్కల వాళ్ళలో కలిసిపోతాడు. పన్నెండేళ్ళయినా దాటని పసివాడు. సాయంత్రందాకా బడిలోనే వున్నాడు. హాయిగా ఆడుకొన్నాడు. దీపాలు పెట్టేసరికి కలకలలాడే ముఖంతోటి ఇంటికి వచ్చాడు. రాత్రి కూడా సుష్ఠుగా భోజనం చేశాడు. ఒక కునుకు కూడా తీశాడు. నిద్రలోనే లేచాడు. రెండుమార్లు భేదులూ వాంతులూ అయ్యాయి. తల్లిదండ్రులకు చేతులెత్తి నమస్కరిస్తూ అవులించాడు. విశ్వనాథంగారు గుండెధైర్యంగల మనిషి. ఆలోచన కుటుంబ సహితంగా అయన బావమరది కూడా అక్కడే వున్నారు. ఇద్దరూ శాయంపట్టి రవి ప్రేతాన్ని భూమికి చేర్చారు. సంస్కారం పూర్తి అయింది.

...

3

పథ్యం ఒంటబట్టేదాకా తమ యింట్లోనే ఉంచమని పెద్ద కాపుగారి భార్య గట్టిగా పట్టుబట్టడంచేత వీరాయి తండ్రి ఒప్పుకోక తప్పింది కాదు. క్రమక్రమంగా వీరాయి కోలుకొంటోంది. చావచ్చిన ఆమె పసుపుదొడవలో సెన్నుదిసెన్నుదిగా నాడులు కొత్త నెత్తురు నింపుకున్నాయి. లేజా కారంగులో నూతన జీవితం ఆమెలో చిగురుస్తోంది. సుందరరావు కూడా తనకి సపర్యలు చెయ్యడం చూస్తున్న ఆ లేజవరాలి ప్రాణం లెక్క చచ్చిపోయి,

...





...

ట్లో ఉన్నది ఆమె తండ్రి, ఎదుగుతున్న చెల్లెళ్ళు-ఇష్టంలేని భర్త నొక వంక తాను చేబట్టలేని సుందరరావు నొకవంక చూస్తూ ఎంతకీ గడవని కాలావధిని బహు భారంగా నెట్టుతూ తాను. ఇక పోతే వీరిని పరివ్యాప్తపరచిన విషణ్ణ వాతావరణం. ఏ ప్రొద్దునా వీరాయి గదిలో రోదనలే ప్రతిధ్వనించాయి. ప్రతిరోజూ చిరబురలే. కొట్లాటలే, వీరాయికి శాంతిలేదు. భర్తకి సుఖం సున్న. తండ్రి క్రమంగా కృశించిపోతున్నాడు. చెల్లెళ్ళకి ఏమీ తెలియడం లేదు. లోకం బహు విచిత్రంగా ఉంటుంది. దుర్భరమయిన వీరాయి కుటుంబ పరిస్థితులు ఇరుగు పొరుగులకు ఒకప్రక్క వినోదాన్నీ-ఒకప్రక్క విషాదాన్నీ కన పరుస్తున్నాయి. కొందరా చిన్నదాన్ని ఓదారుస్తున్నారు. "అమ్మా! ఊరుకో! అయిపోయిన దాని కింకేంచేస్తావు? మన సాంప్రదాయాన్ని బట్టి హిందూ స్త్రీకి భర్తే దైవం. పురాణాలు వినలేదా? మహా పతివ్రతల జీవితగాథలు చూడలేదూ? కష్టమో-సుఖమో, మంచో-చెడ్డో; భగవంతుడు నీ కొకరిని భర్తగా ప్రసాదించాడు. ఇది విధి విధానం. ఎవ్వరూ తప్పించలేరు."

ఎవరేమి చెప్పినా వీరాయి మౌనంగా వినడంతప్ప మరేమీ చెయ్యలేకపోతోంది. తాను ఎప్పుడు ఎలాగ ఏ పాపం చేసినందుకు ఈ శిక్ష అనుభవిస్తోంది? ఈ మోడువారిన జీవితం ఇక ఎప్పుడు చిగురుస్తుంది? యీ చీకటి రాత్రికి అంతు లేదా?

...

మద్యనిషేధ విజయానికి

# ప్రజలలో విరివిగా ప్రబోధం అవసరం

శ్రీ దండా రామిరెడ్డి

మద్యపానము వలన ఎన్నో సంసారాలు చితికిపోయినవి. ఆరోగ్యము చెడి ఎందరో అకాలమరణానికి గురి అయినారు. త్రాగుబోతు భర్త భార్యను నానాహింసలు పెడుతుంటే సహించి, చివరకు జీవితాలనే అంతము చేసికొంటున్న నారీమణు లెందరో వున్నారు.

త్రాగుబోతుల్లో అధికసంఖ్యాకులు నిరుపేదలు. దినమంతా కష్టించి సంపాదించిన డబ్బులు త్రాగుడుకు ఖర్చు పెట్టి, భార్యాబిడ్డలను పస్తుపెట్టి, తాను ఆనందిస్తుంటాడు త్రాగుబోతు. మన దేశములో సగటున మనిషి ఆయుర్దాయము 26 సంవత్సరములయితే ఇంగ్లండు దేశములో సగటు ఆయుర్దాయము 67½ సంవత్సరాలు. మనవారి యింత అల్ప ఆయుర్దాయమునకు త్రాగుడు ఒక ముఖ్యకారణమని చెప్పాలి.

పారతంత్ర్యములో నున్న భారతదేశానికి స్వాతంత్ర్యము సిద్ధించింది. జాతీయ ప్రభుత్వము ఏర్పడింది. మరపురాని మహనీయుడు, పూజ్యబాపూజీ మద్యమనే మహాపిశాచిని మనదేశము నుండి పారద్రోలి నిరుపేదల దుర్భర జీవితాలను చక్కదిద్దాలని ఆకాంక్షించి ప్రభుత్వానికి ఆదేశమిచ్చాడు.

ఉమ్మడి మదరాసు రాష్ట్రము 17 కోట్లు పైచిలుకు వచ్చే ఆదాయమును గూడసరకుచేయక మహాత్ముని ఆదేశానుసారం మద్యనిషేధ చట్టం అమలుపరచింది. చట్టము అమలు పరచినందువలన జీవనోపాధి పోయిన కొంతమందికి జీవనోపాధి కూడా కల్పించటం జరిగింది.

ఈ చట్టము ప్రవేశపెట్టిన తర్వాత ముఖ్యంగా త్రాగుబోతు భర్తలుగల ఆడవాళ్ళు ఎంతో ఆనందించారు. దారిద్ర్యం యింటిలో పోయిందనుకున్నారు.

పొట్టి శ్రీరాములు ఆత్మబలిదానంతో ఆంధ్రులకు ప్రత్యేకరాష్ట్రం సిద్ధించింది. ఆంధ్రకేసరి టి. టంగుటూరి ప్రకాశం పంతులుగారు ముఖ్యమంత్రిగా క్రొత్త మంత్రివర్గం ఏర్పాటయింది. ఆంధ్రప్రభుత్వము కూడా మద్యనిషేధ చట్టాన్ని అమలుపరచింది. బలీయమైన ప్రతిపక్షం పోటులు తీసికొనివస్తే బాగుంటుందన్నారు. మంత్రి పదవులకైనా రాజీనామా ఇస్తాముకాని ఒకసారి ప్రవేశపెట్టిన చట్టాన్ని ఎంతమాత్రము తొలగించటానికి వీలులేదని ప్రభుత్వమువారన్నారు. చివరకు యీ విషయంమీదనే ప్రభుత్వం పడిపోయింది. తిరిగి ఎన్నికలు జరగటం, కాంగ్రెసు అఖండ విజయం పొందడం జరిగిపోయింది. శ్రీ బెజవాడ గోపాలరెడ్డి ముఖ్యమంత్రిగా కొత్త మంత్రివర్గం ఏర్పాటయింది. శ్రీ ఎ. బి. నాగేశ్వరరావు గారు మద్యనిషేధశాఖామాత్యులు. వారు అనేక సభలలో "మద్యనిషేధ చట్టాన్ని నా శాయశక్తులా కృషిచేసి విజయవంతమగునట్లు చేస్తాను. దీనికి ప్రతిగ్రామములో ప్రచార కమిటీలు ఎంతో అవసరము. ఈ కమిటీల నియామకము

(10 పుట చూడుడు)

జీవితాన్ని ఒకసారిచూడు. నాయనా! బ్రతుకు సుఖశాంతులతో స్వర్గతుల్యంగా జీవించడానికి మానవునకు భగవంతుని వల్ల ఇయ్యబడ్డ వరప్రసాదం. అంతేకాని జీవితయానంలో సంభవించిన ప్రమాదానికి తలఒగ్గి, చివికి జీర్ణమై, శిథిలమై పోవడానికి మనం ఇక్కడికిరాలేదు. నువ్వు పురుషుడవు. పౌరుషాన్ని ప్రదర్శించు. నీ అరచేతిలో ఉన్న అపూర్వమయిన అవకాశాన్ని సద్వినియోగం చేసుకో. అనుకూలమయిన పిల్లనిచూచుకొని పెళ్లిచేసుకో. కనీసం నామాటవిని అయినా ఒక యింటివాడవుకా! కాదని, తీరని కోరికలతో మనస్సుని వికలం చేసుకొని, చేరలేని ఆదర్శాలకోసం దివారాత్రాలు పరితపించి, పండంటి యౌవనాన్ని భగ్నం చేసుకోవడం మగతనం కాదు." విశ్వనాథం మాష్టారి హితోపదేశంతో సుందరం ప్రస్తుతం లోకివచ్చాడు.

"మాష్టారూ! మీరు చెబుతున్నది నిజం కావచ్చు కాని నేనింకా దాని అంతరార్థాన్ని అర్థంచేసుకోగలిగేటంత ఉన్నత స్థాయికి పెరగలేదు. పెండ్లి అంటే కేవలం కోరికలు తీర్చు

...

# సమాజాభివృద్ధికి వేసవి సెలవుల్లో విద్యార్థుల కృషి

[శ్రీ మణుగూరి సత్యనారాయణరావు]

పంచవర్ష ప్రణాళిక క్రింద ముఖ్యముగా గ్రామాలను అభివృద్ధిలోకి తీసుకు రావలెనను పెడితలంపు ప్రభుత్వమునకు కలిగినది. అందులకు సమాజవికాస కేంద్రములనెడి వాటిని ప్రతిజిల్లాలో 10, 15 టిని నెలకొల్పినది. ఈ కార్యక్రమం క్రింద ప్రతిజిల్లాకు ప్లానింగు ఆఫీసరునొకరిని నియమించి ఆయన ఆధ్వర్యము క్రింద ఆకేంద్రములను నడుపుచున్నది. ప్రతి కేంద్రమునకు ఒక బ్లాకు డెవలప్‌మెంట్ ఆఫీసరును, యింకా కొంతమంది ఉద్యోగులను నియమించి ఆబ్లాకు క్రిందనున్న గ్రామాలను అభివృద్ధిపరచుటకు ఒక స్కీమును తయారుచేసి దాని ప్రకారం కార్యక్రమమును నడుపుచున్నది ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వము.

ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం ప్రతిసంవత్సరమూ విశ్వవిద్యాలయము తరఫున అన్నికళాశాలలనుండి కొందరువిద్యార్థి విద్యార్థినులకు అభివృద్ధి కార్యక్రమములలో శిక్షణనిప్పించివారిని గ్రామాలలో పర్యటించి అభివృద్ధికార్యక్రమాలు ఎలా సాగుతున్నదీ, గ్రామస్థుల సాధక బాధకాలేవిటో తెలుసుకుని వారికి తగురీతిగా సాయపడవలసిందిగా కోరి పంపుతున్నది. ఈపథకంను పశ్చిమ బెంగాలు ప్రభుత్వం ప్రవేశపెట్టింది. 1955 సం॥ నుండి ఆంధ్రప్రభుత్వం కూడా అమలుపరచింది. ఈ పథకం క్రింద ఏటా ఏబదివేల రూపాయలను ఖర్చుచేయుచున్నది.

ఆంధ్ర విశ్వవిద్యాలయం వివిధకళాశాలలనుండి విద్యార్థి, విద్యార్థినులు, అధ్యాపకులను కొందరిని నిర్ణయించింది. విద్యార్థులు 117 మంది, అధ్యాపకులు 13 మందికలసి 130 మందికి ఈపథకం క్రింద ఈ వేసవిలో శిక్షణగరపింప చేసింది.

## శిక్షణ కేంద్రం

విద్యార్థి, విద్యార్థినులందరికీ శిక్షణ కేంద్రంగా సామర్లకోటను నిర్ణయించింది ప్రభుత్వం. సామర్లకోటలో 'Extension Training centre' అనునొకదానిని స్థాపించింది ప్రభుత్వం. దీనిక్రింద నూరుఎకరముల విస్తీర్ణముకలిగిన భూమికలదు. ఈ శిక్షణకేంద్రంలో ప్రతిసంవత్సరమూ గ్రామసేవకులు—సేవికలు, సాంఘిక విద్యావ్యాప్తి శిక్షకులు మొదలగువారికి శిక్షణగరిపి వారిని గ్రామాభివృద్ధి కార్యక్రమములకు వినియోగించుచున్నది. ఇక్కడ ప్రతి గ్రామసేవకుడికి-సేవికకు శిక్షణ కాలంలో రు. 80/- ఉచితవేతనం యిస్తుంది ప్రభుత్వం. ఈ సంస్థకు ఫోర్డు ఫౌండేషన్‌నుండి సహాయం లభిస్తున్నది. ఈ కేంద్రం ఆధ్వర్యాన పండించు పంటలు: పంచదార, బియ్యం, అరటి, పసువులకు గరిక, కూరగాయలు, వివిధరకముల ఫలములు, పుష్పములు మొదలగునవి.

ఈ శిక్షణ కేంద్రంలో పంచాయితీలు, సాంఘికవిద్య, ఐకమత్యం, కుటీర పరిశ్రమలు, వ్యవసాయం, ఆరోగ్యం మొదలగు విషయములలో తగిన సామర్థ్యంకల అధ్యాపకులచేత శిక్షణ ఇవ్వబడుతుంది.

## శిక్షణ వివరాలు

మాది ఆరువారాల కార్యక్రమం. ఏప్రిలు నెల 24 వ తేదీనుండి జూన్ 7 వ తేదీవరకు మా శిక్షణ కాలంగా ప్రభుత్వం నిర్ణయించింది. ప్రారంభంలో ఏప్రిలు 24 వ తేదీ నుండి 31 వ తేదీవరకు సామర్లకోట విస్తరణ కేంద్రంలో పైన వివరింపబడిన విషయాలన్నిటిలోనూ శిక్షణ యిచ్చారు.

మాకు మొదటి వారంరోజులలోనూ బోధించింది సమాజాభివృద్ధి కార్యక్రమములనుగురించి మాత్రమే. వ్యవసాయికంగా జపాన్ వరిసాగుపద్ధతిని బోధించి, ఎలాచేయవలసినదీ చేసి చూపారు. గ్రామాలలో పారిశుధ్య విషయమై ముఖ్యముగా తీసుకోవలసిన పద్ధతులను బోధించారు. సెప్టిక్‌టేంకు మరుగుదొడ్లను, ఇంకుడు గుంటలను గ్రామస్థులచేత నిర్మించుకొనేటట్లు చేయుచున్నారు. కంటికి దెబ్బ రాకుండా వుండుటకు యిండ్లలో పొగలేని పొయిలు నిర్మించేవిధానం చూపించి వాటిని గ్రామాలలో బాగా అభివృద్ధి చేయుచున్నారు. వారు మాకు ప్రయోగాత్మకంగాచేసి చూపించిన ప్రతి కార్యమునూ గ్రామాలలో విరివిగా ప్రచారంచేసి గ్రామాలను తగురీతిగా అభివృద్ధిపరచమనట్లుగా కోరారు.

వారము దినముల కార్యక్రమం పూర్తవగానే, మమ్ములను ఏ జిల్లా విద్యార్థులను ఆ జిల్లాలోగల సమాజాభివృద్ధి కేంద్రములకు పంపారు.

గుంటూరుజిల్లాకు చెందిన 36 గురు విద్యార్థి, విద్యార్థినులం 1 వ తేదీ గుంటూరు చేరాం. అక్కడి జిల్లా ప్లానింగు అధికారి మమ్ములనందరినీ సమావేశపరచి 2 వ తేదీ ఒక మీటింగు పెట్టారు. అప్పుడు మేం ఏ ఏ కేంద్రాలకు వెళ్ళవలసినదీ, ఆ కేంద్రాధికారు లెవరైనదీ, మేం చేయవలసిన పనులేవిటో మొదలగునవన్నీ మాకు పరిచయంచేసి 3 వ తేదీన మా మమ్ములను మాకు కేటాయించిన కేంద్రాలలో ప్రవేశించమన్నారు.

## ఐదువారాల కార్యక్రమం:

గుంటూరు జిల్లాలో మా క్రింద వినియోగింపబడిన సమాజాభివృద్ధి కేంద్రాలు: 1. మద్దిపాడు. 2. అమ్మనబ్రోలు. 3. ఈపూరు. 4. కర్లపాలెం. 5. మాచెర్ల మొదలగునవి.

మాది మద్దిపాడు సమాజాభివృద్ధి కేంద్రం. ఈ కేంద్రానికి మొత్తం పదిమందిని కేటాయించారు. ఆరుగురు విద్యార్థులు నల్గురు విద్యార్థినులు.

మమ్ములను ఈక్రింది విధంగా కేటాయించారు:

మద్దిపాడు గ్రామసేవకునికి సహాయంగా 4 విద్యార్థినులను, ఏడుగుండ్లపాడు గ్రామసేవకునికి సహాయంగా 2 విద్యార్థులను, సంతనూతలపాడు గ్రామ సేవకునికి సహాయంగా 3 విద్యార్థులను చీమకుర్తి గ్రామసేవకునికి సహాయంగా ఒక విద్యార్థిని కేటాయించారు.

ప్రారంభమున 3, 4 తేదీలు మద్దిపాడులో పైపదిమంది విద్యార్థులం గడిపాం. బ్లాకు ఆధ్వర్యమున నడపబడుచున్న పుస్తకములను, అభివృద్ధి కార్యక్రమములను పరిశీలించాం. తెలుసుకోవలసిన విషయముల నన్నింటినీ బ్లాకు అధికారులవద్దనుండి తెలుసుకున్నాం.

5 వ తేదీ బయల్దేరి మామా గ్రామములకు చేరాం. మామా గ్రామసేవకులకు సహాయంగా మిగిలిన 33 దినములు పనిచేయవలసి వచ్చింది.

మాది సంతనూతలపాడు గ్రామం. ఇది ఒంగోలు తాలూకాలోచేరి, ఒంగోలుకు 8 మైళ్ళ దూరంలో నెలకొని యున్నది. ఈ గ్రామం క్రిందకు అభివృద్ధి కార్యక్రమముల దృష్ట్యా వచ్చు పల్లెలు: పేర్నమిట్ట, నాంచారెడ్డి పాలెం, ఎండ్లూరు, మన్నావారిపాలెం, మంగమూరు, గుడిపాడు, చంద్రవారి పాలెం, గుమ్మనంపాడు, గంగవరం, బొడ్డువారిపాలెం, కొనగానివారిపాలెం, కామేపల్లివారిపాలెం మొదలగునవి.

ప్రతిదినం ఉదయం 5 గంటలకు లేవడం, కాలకృత్యాలు ముగించడం, కాఫీ సేవించి 7 గంటలకల్లా గ్రామాలకు కాలినడకన బయల్దేరడం. ఒక్కొక్క గ్రామం నాలుగైదు మైళ్ళ దూరంలో వున్నది. అక్కడ అభివృద్ధి కార్యక్రమములను గురించి ప్రచారం చేయడం. (ఉపన్యాసాల ద్వారా) వాటిని ప్రజలచేత ఆచరింప చేయడం మాముఖ్య కర్తవ్యమై యున్నది.

ఇది వేసవికాలం అవటం మూలాన మాబాధ లంతింత అని చెప్పవలసి కాదు. మాకు తోడుగా గ్రామసేవకుడుకూడా వచ్చేవాడు. ఆతని సాయంతో పల్లె ప్రజలలో చొరవచేసుకుని అభివృద్ధి కార్యక్రమాలను ప్రచారంచేసేవాళ్ళం. రాత్రిబడులను నడిపేవాళ్ళం. అభివృద్ధి కార్యక్రమములను నాటకాలు, హరికథలు, రూపముగా ప్రదర్శించి గ్రామస్థులకు చూపెడివారము. ప్రదర్శనముల వలన ఉపయోగం అధికంగా కన్పించింది:

ఆరోగ్య విధానాలక్రింద గ్రామాలలో ఈ క్రిందివానినిగురించి ప్రచారం చేశాం:

3' పొడవు, 3' వెడల్పు, 3' లోతున ఒక గుంటను త్రవ్వవలయును. అట్లు త్రవ్వించినవారికి ప్రభుత్వము రు. 15 ఖరీదు చేయు సింగాణీ పాత్రను ఉచితముగా సరఫరా చేయును. ఆ గుంటపై మూడు నాపరాయి బండలను దిగింప చేయవలయును. తరువాత వాటి మధ్య ఈ సింగాణీ పాత్రను ఒక ప్రక్కగా దిగించి చాలుగ పైపులా సిమెంటు చేయవలయును. దానిలోని దుర్వాసన వెడలుటకుగాను ఒక మూల నొక గొట్టమును అమర్చవలయును. అప్పటికి ఇది ఒక చక్కని కక్కసు దొడ్డిగా తయారగును. దొడ్డికి వెడలిన తరువాత రెండు మూడు బకెట్ల నీటిని విసరి కొట్టిన అది ఆ గుంట లోనికి మలిన పదార్థముతో సహా పోవును. ఈ దొడ్డికి పాకీవాని అవసరం లేదు. దీనిలో నున్న దుర్వాసన ప్రక్క గొట్టముద్వారా బయటకు వచ్చి గాలిలో కలసిపోవును. దీనిని పది సంవత్సరముల వరకు కదల్చ వలసిన పనిలేదు.

## పొగలేని పొయ్యిలు

నిర్మాణ విధానం: వీటిని మగన్ వాడిలో కనుగొన్నారు. 6' పొడవు 3' వెడల్పున ఒక చట్రమును నిర్మించి దానిలో రెండు రంధ్రములను చేయవలయును. చివర ఒక గొట్టమును పెట్టవలయును. ఈ గొట్టము యింటిపై కప్పులోనుండి బయటకు వచ్చునట్లు అమర్చవలయును. ఈ పొయివలన ఒకే యిద్దములో మూడు వంటపదార్థములను తయారు చేయవచ్చును. ఆర్థికంగా మామూలు పొయికి నెలకు రు 12 వంట చెరకు ఖర్చయిన దీని వలన నెలకు రు 6 మాత్రమే ఖర్చగును. ఇది ప్రయోగములవలన తేలినది. పొగ ఏమాత్రం వెలుపలకు రాదు. మన కండ్లకు కూడ ఏవిధా ప్రమాదము వాటిల్లదు. దీనిని బ్లాకుల క్రింద నున్న పల్లెలకు ప్రభుత్వమువారు ఉచితముగా సరఫరా చేయుచున్నారు.

## ఇంకుడు గుంటలు

పారిశుధ్యవిషయములో ఈ గుంటలు అతిప్రాధాన్యతను వహించియున్నవి. ఇదేమంత కష్టమైన కార్యంకాదు. అతి సులభమైన పని. ఉపయోగం అధికం. 3' లోతు, 3' వెడల్పున ఒక గుంటను త్రవ్వడం, లభ్యమగు ప్రదేశాలలో ఒక వంతు ఇసుక, ఒక వంతు బొగ్గు— మరొకవంతు ఇసుక, దానిపైన ఇటుకరాయి ముక్కలు వేసి గుంటను పూడ్చవలయును. లభ్యముగాని ప్రదేశములలో అంతా యిటుకలతోనే పూడ్చవచ్చును. దానిపైన ఒక నాపరాయి బండ వేసినచో అది ఒక యింకుడు గుంటగా తయారగును. మనం కాళ్ళు, చేతులు, ముఖం మొదలగునవి గాని, గిన్నెలుగాని ఆ గుంటపైన కడిగినచో ఆ చెమ్మ నీరంతా గుంటలోనికి పోయి యింకిపోవును. తేమా అణుమాత్రంకూడా కనిపించదు. తేమ లేకపోవుట వలన దోమలు ఈగలు మొదలగువాని అభివృద్ధికి ఆస్కారం వుండదు. అంటు రోగముల బారినుండి తప్పించుకొన వచ్చును.

## పశుసంపద

సమాజాభివృద్ధి కేంద్రముల ద్వారా ప్రభుత్వమువారు మేలుజాతి కోళ్ళను పెంపొందింపచేసి వానిని గ్రామస్థులకు సరఫరా చేయుచున్నారు. అభివృద్ధి కేంద్రములలో పశువుల వైద్యు డొకాయన వుంటాడు. కోడి అవసరం లేకండా గ్రుడ్లను 'ఇన్‌క్యూబరేటర్' అను యంత్ర సాహాయముచేత పిల్లలుగా తయారుచేసి, ఆ పిల్లలను నెలవారీగా రేట్లు నిర్ణయించి వాటిని గ్రామస్థులకు అమ్మడం ఆయనపని. అట్లు తయారై పెరిగిన కోడి అణగకుండా ఎల్లప్పుడూ గ్రుడ్లు పెడ్తూనే వుంటుంది. గ్రామాలలోమాత్రం ఈ కోళ్ళు మంచి అభివృద్ధిలో వున్నవి.

ప్రభుత్వమువారు గ్రామాభివృద్ధి కేంద్రములద్వారా హైదులనసీమపందులు పొట్టేళ్లు, ఆంబోతులు మొదలగువాటిని యిప్పించుచున్నారు. దీనికి సగము ఖరీదు గ్రామస్థుడు భరించుకొనవలయును. మిగిలిన సగము ప్రభుత్వము భరిస్తుంది. దీనివలన మంచిరకం పశువులను అభివృద్ధిలోకి తీసుకురావలెననెడిది ప్రభుత్వాశయం.

ప్రభుత్వమువారిచే నియమింపబడిన మత్స్యశాఖవారు గ్రామస్థులకు చేప పిల్లలను సరఫరా చేయుచున్నారు. ఒక్కొక్క పిల్లఖరీదు ఒక అణా, ఈ పిల్లలను గ్రామాలలోని చెరువులు, బావులలో వేసిన అవి 5, 6 నెలలకు పెద్దవిగా తయారై ఒక రూపాయి ఖరీదు చేయును, దీనివలన కూడా గ్రామస్థులకు మంచి ఫలితములు కలుగుచున్నవి.

## తేనెపెట్టెలు

అభివృద్ధి కేంద్రములలో తేనెతీయుటకు ఒక సులభమైన పద్ధతిని అనుసరించుచున్నారు. ఈ తేనె తీయుటకు ప్రత్యేకముగ ఒక రకమైన పెట్టెలను ప్రభుత్వము అనుభవజ్ఞులచే తయారు చేయించుచున్నది. ఈ పెట్టె ఖరీదు రు. 10/- వీనిని బాపట్లనుండి తెప్పించి గ్రామస్థులకు సరఫరా చేయుచున్నారు. దీనికై ప్రభుత్వము ఒక ప్రత్యేకోద్యోగిని నియమించినది. ఆ ఉద్యోగి పెట్టెను గ్రామస్థునివద్దకు తీసుకువెళ్ళి దానితో పాటు ఆకతీగనుకూడ తీసుకుని వెళ్ళి తేనె తీయువిధమును గ్రామస్థునికి చేసి చూపించును. దీనివల్ల వారమునకు రెండుపౌన్ల తేనెలభించును. రెండువారములలో మనకు పెట్టెఖరీదు వచ్చును. దీనికి పెద్దగా శ్రమించవలసిన పనిలేదు.

## సాంఘికవిద్య

కాదు-అనేకగ్రామాలు వెనకబడి వుండటానికి కారణం విద్యలేకపోవడమే. ఒక్కొక్క గ్రామంలో యిద్దరు యువకులు కూడ చదువుకున్నవారు కనపడరు. పొట్టపోసుకుంటానికి యింత పండించుకుంటున్నాంలే యికమనకి మిగతా ప్రపంచంతో పనేముంది అనే అభిప్రాయం గ్రామస్థులలో బాగా ప్రబలిపోయింది. ఉదాహరణకు ఒక గ్రామస్థునితో మాకు జరిగిన సంభాషణ వల్ల పల్లెవాసులెంత అజ్ఞానులో అర్థం అవుతుంది.

వ్యవసాయదారుడు: ఏం బాబూ ఈ డబుల్ మెంటు క్రింద అనవసరంగా డబ్బు తగలేస్తారు. దీనివల్ల మాకేం వుపయోగంలేదు. వీటికంటె సులభంగా డబ్బు సంపాదించుకునే మార్గం చెప్పండి.

నేను: అదేమిటండీ. మనం పుట్టడం డబ్బుతోనే పుట్టామా. నీకు 40 ఎకరాలుంది. దానిని పండించి నీవుతినావచ్చు, మరొకరికి పెట్టావచ్చు. ఇంకా నీకు డబ్బు సంపాదించవలెననెడి తాపత్రయం ఎందుకు చెప్పు. మీవూరికి రోడ్డులేదుకదా? ఒక రోడ్డు వేసుకుంటానికి ఎందుకు ప్రయత్నించకూడదు?

వ్యవ: ఎందుకు బాబూ మాకురోడ్డు? ఇదివరలో ఎట్లానడిచామో యిప్పుడూ అలాగే నడుస్తాం.

నేను: వర్షాకాలంవస్తే మోకాటిలోతు నీరు నిలుస్తుంది కదా. ఆసమయంలో అకస్మాత్తుగా నీ భార్యకు జబ్బుచేసిందనుకో. వైద్యుడిని పట్నం నుండి పిలుచుకు రావాలి. అప్పుడేలా వెళ్తావయ్యా.

వ్యవ: దానికేముంది. వీలుంటే పోతాం. వీలు లేకపోతే చచ్చిపోతుంది. అంతేగా.

ఇంత అమాయికంగా అర్థరహితంగా ఆ గ్రామస్థుడు మాట్లాడటానికి ముఖ్య కారణం సాంఘికవిద్యాలోపమే. అందువలన ప్రభుత్వం ముందు గ్రామాలలో విద్యను బాగా వ్యాపింప చేయాలి. ముందు విద్యవిషయంలో తను శ్రద్ధతీసుకుంటే తరువాత మిగిలిన కార్యక్రమాలు అతి సులభంగా జరిపించవచ్చు.

స్త్రీల జనాభ్యుదయ సంక్షేమశాఖలను పేరిట ప్రభుత్వము ప్రతి జిల్లాలోను కొన్నింటిని నెలకొల్పింది. మద్రాసులో నెలకొల్పబడిన శిక్షణాలయంలో శిక్షణపొందిన కొందరు మహిళలను ఈ శిక్షణ కేంద్ర నిర్వాహకులుగా నియమించింది. విరామ సమయంలో గ్రామ స్త్రీలకు కుట్టు పనులు, పిల్లలను శుభ్రంగా వుంచడం, గృహాలంకరణ, విద్యను బోధించడం మొదలగు కార్యక్రమాలను జరుపుతుంటమే వీరి కర్తవ్యం. వీటివల్ల గ్రామ స్త్రీలకు చాల ఉపయోగకరముగా యున్నది.

## పంచాయితీల కర్తవ్యం

ప్రతి గ్రామానికి పంచాయితీబోర్డు ఒకటుంటుంది. దానికి ప్రజాస్వామ్య పద్ధతులపై నియమింపబడిన అధ్యక్షుడొకడు, ఉపాధ్యక్షుడొకడు మరి కొందరు సభ్యులుంటారు. గ్రామాలలో రోడ్లు వేయించడం, బావులను త్రవ్వించడం, స్కూళ్ళు స్థాపించడం, యువజన మండలులను స్థాపించడం, రేడియో కేంద్రాలను నెలకొల్పడం వీరి కర్తవ్యమై యున్నది. పైన వివరించిన పనులలో దేనికైనను ప్రభుత్వము సగము ఖర్చును భరిస్తుంది. మిగిలిన సగము పంచాయితీ భరించుకోవాలి. అది ప్రజల రూపకంగాగాని లేక పూర్తి మొత్తం పంచాయితీ సమాఖ్య నుండిగాని రావచ్చు. కనుక పంచాయితీలు తమ తమ విధులను చక్కగా నెరవేర్చి గ్రామాలను అభివృద్ధిలోకి తీసుకురావాలి.

## సేవకుడు: సేవిక

గ్రామాభివృద్ధి కార్యక్రమములలో అగ్రస్థానం వహించిన వారు వీరిద్దరు. గ్రామాభివృద్ధ కార్యక్రమాలు మిగిలిన అధికారులపైకంటె వీరిద్దరిపై ఎక్కువగా ఆధారపడి వుంటవి. కాని తమ తమ కర్తవ్యాలను నెరవేర్చే గ్రామసేవకులు అరుదుగా నున్నారు. కాని వారలా వున్నంతకాలం గ్రామాలు అభివృద్ధిలోకి రావు. ఆత్మపరిశోధన చేసుకుని ఎవరికి వారు గ్రామాలను అభివృద్ధిలోకి తీసుకురావలెననెడి తలంపుతో ముందుకు వస్తేనే దేశాభివృద్ధి కలుగుతుంది. ప్రతి గ్రామ సేవకుడు-సేవికకు రు 80 జీతము ప్రభుత్వ మిచ్చుచున్నది.

గ్రామాలలో సాంఘిక విద్య తీరని లోటుగా యున్నది. ముందు దీనికి బాగా వ్యాప్తి చేయాలి. గ్రామసేవకుడు గ్రామాలు పర్యటించటానికి తగిన వాహన సౌకర్యాలు అమర్చాలి. కొన్ని గ్రామాలకు రోడ్లువుంటే బావులు లేవు, బావులుంటే రోడ్లులేవు. అందుచేత గ్రామపరిస్థితులబట్టి ప్రభుత్వము ధనమును మంజూరు చేయాలి. ఈ కార్యక్రమం క్రింద బీదవారికంటె ఎక్కువగా భాగ్యవంతులకు లాభం కల్గుతుంది. అట్లాకాకుండా సాయం ఎక్కువగా బీద ప్రజలకందేటట్లు చూడాలి. అధికారులు స్వయంగా గ్రామాలు పర్యటించడం లేదు, అట్లాకాకుండా అధికారులు స్వయంగా పర్యటించి గ్రామస్థుల సాధకబాధకాలు తెలుసుకోవాలి. అంతేకాని పూర్తిగా గ్రామసేవకులమీద ఆధారపడితే ఫలితం శూన్యం.

పైన వివరించిన లోపాలనన్నింటినీ సక్రమంగా తీర్చి దిద్ది, ప్రతివ్యక్తీ మనఃపూర్వకముగ తన విధి తాను నెరవేర్చగలిగిన గ్రామాలు మంచి అభివృద్ధిలోకి వచ్చి భారతదేశం సర్వతోముఖంగా వభివృద్ధినందగలదు. వచ్చే సంవత్సరం విద్యార్థులు యింకా ఎక్కువగా కృషి సల్పి గ్రామాభివృద్ధికి తోడ్పడగలరని ఆశిస్తూ సెలవు తీసుకుంటున్నాను.

ఈ వంటచెరకులో మంచి గంధపు పుల్లలు వున్నాయా?

# అడవి జంతువులు మనుష్యుల్లాంటివి కాదు

## మనం ఏమీ అనకపోతే అవీ ఏమనవు

శ్రీ ఎ. జె. యల్.

అడవి జంతువులు, ఏదో కోపంవస్తే తప్ప, ఎవ్వరిజోలికీ పోవు. పైగా ఆ కోపంకూడా సొంతంగా కలిగించుకోవు — ఎవరైనా కల్పించాలి. అప్పుడు అవి ప్రమాదకరంగా విజృంభిస్తాయి.

ఈ మధ్య కాగ్వెల్ వెల్స్ అనే పరిశీలకుడు, తను చూసిన సంఘటనలనూ, అనుభవాలనూ పురస్కరించుకొని పై అభిప్రాయానికి వచ్చాడు.

వెల్స్ ఒక పుస్తకంకూడా వ్రాశాడు. ఈ అనుభవాలనూ సంఘటనలనూ వివరిస్తూ, అందులో ఒకటి రెండు ఇక్కడ ఉదహరిస్తున్నాము.

ఒకావిడ ముందుగా ఒక ఖడ్గ మృగాన్ని చంపి "వేట" విద్యకు అంకురార్పణ చేసుకోవాలని మనసుపడింది. వాస్తవానికి పెద్ద పెద్ద వేటగాళ్ళు గానీ ఖడ్గమృగం జోలికి పోరు. 'ఖడ్గ మృగంపై కన్నెందుకు వేశావమ్మా' అంటే, 'దాన్ని కొట్టటం సులువు' అంది ఆవిడ. మామూలు తుపాకి గుండు, సీసంది, ఖడ్గ మృగంపైన పని చేయవనీ, ప్రత్యేక ఖనిజ కవచంగల గుళ్ళే కొస్తపనిచేస్తాయనీ ఆమె ఎరగదు. ఇంకేం, తుపాకి వేసుకొని కార్లో బయల్దేరింది—తుపాకిని పేల్చటం ఖడ్గ మృగం చావటం ఏక కాలంలో జరిగిపోతాయి అనే ధీమాతో, సరదాతో. ఒక ఖడ్గ మృగం కనిపించింది. దానిపైన గుళ్ళవర్షం కురిపించింది—ఒకటి-రెండు—మూడు — — — ఏడు! అప్పటికి ఆ ఖడ్గ మృగం తలెత్తి చూసింది! అంతే — అమాంతం ఆవిడమీదపడి, ఆవిడను తిరిగిన మోటకార క్రిందకు మార్చి వేసింది.

ఆ మర్నాడు అదే దోవన సైకోజ్ ఫుట్‌బాల్ బృందంనాయకుడు కార్లో పెళ్లాంతో సహా పోతున్నాడు. ఖడ్గ మృగం కారునుచూసి, అడ్డంగా పరిగెత్తుకొచ్చేసింది. అతనుకూడా అది చంపడానికి వస్తున్నదనుకోలేదు. తీరా అది మీదకు వచ్చేసేటప్పటికి, పెళ్లాన్ని దిగమన్నాడు తను దిగడానికి ప్రయత్నిస్తున్నాడు—ఖడ్గమృగం ఆకారును ఈడ్చి, అతడిని పుచ్చుకొని పచ్చడి చేసేసింది. ఇంతలో ఫుట్‌బాల్ ఆటగాళ్లు వచ్చిసద్దారు—ఖడ్గ మృగాన్ని చంపారు. చూస్తే, దాని ఒంట్లో 7 తుపాకి గుళ్లు తిష్టవేసుకొని ఉన్నాయి. అందువల్ల దానికి తిమ్మెత్తి, కసితీర్చుకోవడానికి పూనుకుంది!

## గొంతు మార్పు

సింహాలు ఆహారం అసలు దొరక్కపోతే తప్ప, మనుష్యులమీదకు రావు. ఆఫ్రికాలో 'సావో' అనే ప్రదేశంలో, సింహాలు మనుష్యులను తినసాగాయి. కారణం — ఆ ప్రాంతంలో రైలుమార్గం వేయడానికి ఏర్పాట ప్రారంభించారు. అడవిలో ఉండే చారల గుర్రాలన్నీ పారిపోయాయి; సింహాలకు ఆహారం దొరక లేదు. అందువల్ల మనుష్యులపైన పడ ప్రారంభించాయి. రైలుమార్గం వేయడం పూర్తి అయింది — మనుష్యులు వెళ్ళిపోయారు — చారల గుర్రాలు తిరిగి వచ్చాయి. సింహాలకు ఆహారం బెడద తప్పిపోయింది.

సింహం, ఆహారం కోసం ఎక్కువ దూరం వెళ్ళదు. దానికి పరుగెత్తే శక్తి లేదు. ఎగిరి దూకుతుంది. దాని కండరాలు అలాటి ఊతాన్ని మాత్రమే ఇస్తాయి. ఒక్క దూకులో, తన ఆహారంపైన అది పడకపోయిందా, ఇక వెనుకకు మరలటానికి అది ఎంతో శ్రమపడాల్సి వస్తుంది. అలసిపోతుంది. అందువల్ల సింహం ఏంచేస్తుందంటే — తాను మైలుదూరాన ఉన్నట్లు భ్రమ కలిగేలా, దగ్గరలోనే ఉండి అరుస్తుంది. జంతువులు అది విని పారిపోతాయి. చల్లగావచ్చి సింహం వాటిల్లో ఒకదానిని నోట కరుచుకుంటుంది.

తేనెపిట్ట, సింహానికి స్నేహితుడు అని ఒక నమ్మకం ఉంది. సింహానికి ఆహారం కాగల జంతువును పిల్చుకొస్తుందట ఈ పిట్ట!

ఒకసారి ఉగాండాలో ఒక పిట్ట చిత్ర విచిత్రాలుగా ఎగరడం పాడడం ప్రారంభించింది. దానివెంట పోగా పోగా ఒక తేనెపట్టు కనిపించింది. ఆ తేనెపట్టు వచ్చేసరికి ఆ పిట్ట నానా హంగామా చేసింది. మేము తేనె తీశాము — దానికిమాత్రం తేనె లభించలేదు. మళ్ళీ తన హడావిడి ప్రారంభించింది. దానివెంటే వెళ్ళాం. అది ఒకచోట ఆగి తన ఆటలూ పాటలూ సాగించింది. తీరా చూసేసరికి 40 గజాల దూరంలో ఒక సింహం ఉంది! అక్కడివారి నమ్మకం ఏమంటే ఆ పిట్టకు తేనెలో భాగం ఇచ్చినట్లుంటే, అది మమ్మల్ని సింహం దగ్గరకు తీసి కెళ్ళేదికాదట!

మధ్య ఆఫ్రికా అంతా కీకారణ్యమనీ, మహారణ్యమనీ, అక్కడ మనుష్యుల్ని తినే సింహాలూ, విషాలు కక్కే పాములూ, సీసీ ఈగలూ, జ్వరాలూ, ఉష్ణం — తప్ప వేరే ఏవీ ఉండవనీ అంటారు. పట్టి అబద్ధం అదంతా, అవి అడవులు కావు — తోటలు — శీతోష్ణస్థితి చక్కగా ఉంటుంది — సుబ్బరంగా తిరగవచ్చు. జంతువులు ఏమీ చేయవు.

(పి. టి. యస్)

# గ్రంథసమీక్ష

## రామాయణం-రాముని రాజనీతి

## శౌర్యమూ ముఖ్యం

## మాయలేడికావాలన్నది మాయసీత(శబరి)!

ఎన్యూ అప్రోచ్ టు ది రామాయణ. రచయిత శ్రీ యస్.ఆర్.నవ్ లేకర్. ప్రకాశకులు మైకేల్ (MYKALE) సబ్‌స్క్రిప్షన్ ఏజెన్సీ, స్ట్రీట్ నంబర్ 6, దంతోలి, నాగపూర్ 1 మూల్యం రూ 10.

రామాయణం పారాయణ గ్రంథం. దాదాపు ఒక బీజాక్షర సంయుత మంత్రం లాంటిదని పలువురి విశ్వాసం. అయితే పరిశోధకుని దృష్టిలో 'రామాయణం' కొంతవరకు ఒక చరిత్ర. మిగతాది అభూతకల్పన రాముడు ఒక సైనిక శ్రేష్ఠుడు. రాజనీతివేత్త. 'వజ్రాదపి కఠోరాణి మృదూనికుసుమాదపి' అయిన మనస్సుకలవాడు. సీత ఇలాటి కఠిన మృదుత్వం కలదికాదు శాంతి మూర్తి.

తనజాతి ప్రజలందరూ లోలురై నిర్వీర్యులై బతుకుతున్నారే అని రామునిబాధ. యథారాజా తథా ప్రజా. తనతండ్రి దశరథుడూ విషయలోలుడే. వృద్ధాప్యంలో కైకను పెళ్లిచేసుకొనడం ఆ మమకారంలో ఉచితానుచితాలను పాటించకుండా, ఆమె కుమారుని యువరాజును చేస్తానని ఆమెతండ్రికి రహస్యంగా మాటఇవ్వడం, దశరథుని లోలత్వానికి నిదర్శనాలు. మారీచ సుబాహులు తన జాతికి పీడగా విజృంభించినా, దశరథునికి చీమకుట్టలేదు. రామలక్ష్మణులను విశ్వామిత్రుడు తీసుకొనివెళ్ళి మారీచ సుబాహుల పీడను మాత్రం వదల్చుకున్నాడు. దక్షిణాపథ పాలకులు విజృంభిస్తూనే ఉన్నారు. రాముడు ఏనాడూ దశరథుని అలసత్వానికి ప్రతిబంధకంగా ఎదురు తిరగలేదు. తండ్రికాబట్టి ఎదురు తిరగలేదు-లోకంలో తండ్రికి ఎదురు తిరగడమే ఒక సంఘటనకాదు, ఎందుకు ఎదురు తిరిగాడా అనేది ఎవ్వరికీ పట్టదు. రాముడు తండ్రిమాటలు వింటూ కాలక్షేపం చేస్తున్నాడు.

చివరకు రామునికి పట్టాభిషేకం చేయాలనుకున్నాడు వృద్ధ దశరథుడు. కైకేయి కూడా సంతోషించింది, రాముడు మంచివాడేనని ఆమెకూ నమ్మకం ఉండడం మూలంగా. అయితే దశరథునిది నిష్కల్మష హృదయం కాదు. అమాయకుడూ కాడు, మంత్రులను వశిష్ఠుని పిలిచి పట్టాభిషేక ముహూర్తం నాటికి భరతుడు ఊళ్లో లేకుండా చూసుకున్నాడు; కైకేయి తండ్రిని పట్టాభిషేకానికి పిలవలేదు. అలాఎందుకు చేశావు? అనే ప్రశ్న వస్తుందని, సీతతండ్రిని కూడా పిలవడం మానివేశాడు. భరతుడు కూడా లేకుండా ఇలా ముహూర్తం పెట్టించడం, కైకేయికి కష్టం వేసింది. దశరథునిపట్ల కక్షపట్టింది! నా కొడుకునే రాజు చెయ్యి అని పట్టుపట్టింది. సహజమైన పట్టుదలే-పైగా తనను ఇంతగా నిర్లక్ష్యం చేసిన భర్తను ఏభార్య క్షమిస్తుంది? దానికితోడు అంతకుముందు దశరథుడు కౌసల్యనూ సుమిత్రనూ నిర్లక్ష్యం చేయడం కైక చూస్తూనే ఉన్నది. ఈ మాత్రం పట్టుదలకే ఊళ్లోలేని భర్త చచ్చిపోతాడని ఆ ఇల్లాలు ఎలా అనుకుంటుంది! రాముడు ఇదే అదనుకొని, ఇల్లువిడిచి వచ్చేశాడు భార్యతో. లక్ష్మణుడు ఇంట్లోనే ఉండిపోతే, రామునికి ఇలాటి దుస్థితి కల్గించినవారిని చంపుతుంటాడు. అందువల్ల లక్ష్మణుని వెంట వేసుకొని బయలుదేరాడు. దక్షిణాపథ సరిహద్దులపైన ఆశ్రమాలు ఏర్పరచుకొని దక్షిణాధీశ్వరుని ఏనాడు ముట్టుపెట్టుదామా, ముట్టుపెట్టే మొగాడు ఎప్పుడు వస్తాడా అని కాచుకొని రోజులు గడుపుతున్న ఋషి కులాలతో సాన్నిహిత్యం ఏర్పరచుకొని రాజ్యరక్షణ దృష్టితోనే రాముడుఅరణ్యంలో ఉంటూ వచ్చాడు. దక్షిణాధీశ్వరుని సైనికులు ఋషి కులాలను బాధించినట్టు రామునిజోలికి రాలేదు. రాముడు మాత్రం దక్షిణాధీశుని జయించడానికి ఎత్తులు వేస్తున్నాడు. 'మనజోలికి రాని వారిజోలికి మనం పోరాదు' అని సీత మతం. సీత అహింసాధర్మ పరాయణ. రాముడు మాత్రం తన పన్నాగాలను మానలేదు.

ఇంతలో శబరి కనపడింది. ఆమె అనాగరకస్త్రీ అయినా రామభక్తి కలది. ఆమెఇచ్చిన ఎంగిలి ఫలాలను తిని రాముడామెకు దాదాపు భర్తఅయిపోయాడు! ఈ రెవ్వరికీ ఆరహస్యం తెలియదు.

తర్వాత శూర్పణఖ వచ్చింది. రాముని మోహించింది. నార చీరలు కట్టుకుని, వాడిపోయి ఉన్న సీతకంటే తాను అందమైన దానినని ఆమె అంటుంది. ఆ నమ్మకం రామునికి కూడా కలిగి ఉంటుందని ఆమె అనుకుంది. రాముడు అలాటి శూర్పణఖను మాటలలోకి దింపి, 'లంక గుట్టు'అంతా తెలుసుకున్నాడు! తెలుసుకున్న తర్వాత తాను ఆమెను పెళ్లి చేసుకొనలేననీ, నీకైతే లక్ష్మణుడు చేసుకుంటాడేమో కనుక్కొమనీ సలహాఇచ్చాడు. అనవుల ఇదినమ్మి లక్ష్మణుని వద్దకు వెళ్లింది, అతడు, ఆమెను చెవులతో పోనివ్వక అందవిహీనను చేసి పంపించాడు! శూర్పణఖ ఈ సంగతిని రావణునికి చెప్పుకుని, కసి తీర్చుకోవలసిందే అని హెచ్చరించింది. రామునికి ఇక రావణునితో తగాదా తప్పని పరిస్థితి.

ఇక్కడ శ్రీ నవ్ లేకర్ ఒక అద్భుత చరిత్రను, అధ్యాత్మ రామాయణం నుంచి తీసుకొని, చెప్పారు. మరి, నవ్ లేకర్ గారికి అద్భుతాలు గిట్టవుట. అయినా, రాముడు సీతను తీసికెళ్లి అగ్నిదగ్గర దాచాడనీ, ఆ మాయసీత మాయలేడిని చూచి మనసు గొన్నదనీ, లక్ష్మణుని తిట్టిందనీ, ఆతర్వాత రావణుడు మాయసీతను ఎత్తుకొని పోయాడనీ, నవ్ లేకర్ గారు నమ్మి రాశారు. తీరా పాపం అసలే సీత, శబరి, లంకలో జరిగిన అగ్ని పరీక్షలో ఆహుతి అయిపోయిందనీ, ఆ పరీక్షా సమయంలో అగ్నిదేవుడు అసలు సీతమ్మను తెచ్చి రామునికిచ్చాడనీ కూడా వ్రాసి, పరిశోధనాదృష్టికి కాకమ్మ పిచ్చుకమ్మ కథను తెరగా వేసుకున్నారు నవ్ లేకర్ గారు. ఎంత వద్దనుకున్నా కొన్ని నమ్మకాలు వదలవు!

సరే-రాముడు కిష్కింధకు చేరాడు. అక్కడ సుగ్రీవుడనే ఒక విషయలోలుని, అశాపాతకుణ్ణి కలుసుకున్నారు. ఆ సుగ్రీవునికి వాలి భార్య కావాలి, వాలి రాజ్యమూ కావాలి. రావణున్ని జయించాలి కాబట్టి, రామునికి సుగ్రీవునితో మైత్రి తప్పలేదు. అందుకోసం అన్యాయంగా వాలిని చంపాడు. అసలు వాలి మహాబలవంతుడు కాబట్టి, అంతవాడు తనకు సామంతుడుగా ఉంటాడా అని రామునికి భయం-చాటుగాచంపేశాడు. సుగ్రీవుని జెనరించి లంకాయాత్రకు సన్నద్ధుణ్ణి చేశాడు. హనుమంతుడు-(అన్నట్లు ఇతడు కోతి కాడు, కిష్కింధ వాళ్లని రావణుడు 'వానరులు' అనేవాడు కానీ వాళ్లు మనుష్యులే)-లంకకు వెళ్లి రహస్యంగా సీతనూ (శబరిని!) మరొక ఆశాపాతకుడైన విభీషణునీ చూశాడు. గుట్టుచప్పుడుగా తిరిగి వచ్చాడు. లంకాదహనమనేది వట్టి కల్పన. హనుమంతుడు స్వామిభక్తిపరాయణుడేకాక రాజనీతి ధురంధరుడు. లంకాదహనం పిల్లలను నవ్వించడానికి సృష్టించినకథ.

తరువాత రామరావణ యుద్ధం-రావణుడు ధీరుడు; వీరుడుగానే మరణించాడు. అప్పటికి సీతకు 44 ఏళ్లు-బాలకుమారి కాదుకదా-ఆమెను రావణుడు మోహించాడనేది వట్టి అభూతకల్పన. కసితీర్చుకొనడానికే తెచ్చాడు. -ఆ కసి ఇలా పరిణమించింది.

కానీ, అయోధ్యలో మాత్రం రాముని భార్యను కొందరు శాస్త్రకంకించారు. తాను నిర్దుష్టగుణాలు కలిగిన రాజునని నిరూపించుకొనడానికి రాముడు ఆమెను వదిలేసి, ఆమెకు తీరని వ్యథ కలిగించాడు. తర్వాత కొన్నాళ్లకు లవకుశులు రాముని కలిసికొన్నారు. అప్పటికి, సీత ముసలిది అయివుంటుంది. జీవితం అంటే అలసట అయిపోయిందామెకు; ఇక రామునితో ఉన్నా ఆమెకు ఆనంద మేమిటి! ఆమె తనువు చాలించింది-ఇంతరాజకీయం, ఇంత హింస, చూడలేక, ఆమె మరణాంతరం, రాముడుకూడా ఆమె గుణాలను అర్థం చేసుకొని తదను గుణంగా పరిపాలన చేసి ఉంటాడు.

అదీ సంగతి. దీనిని వాల్మీకి ఎనిమిది వేల శ్లోకాల్లో రచించడాన్ని, దాన్ని అడ్డమైన కవులూ పెంచీపెంచీ 24 వేల శ్లోకాలు చేశారనీ, తెలిసిన వారు అంటున్నారు.

ఏమైనప్పటికీ రాముడు ప్రస్తుతపు భారత దేశాన్ని ఒక దేశంగా రూపొందించాడు. ఆర్యావర్తమనీ అనార్యావర్తమనీ భేదం లేకుండా చేశాడు, తర్వాత కొందరుఇంకా ఆర్యావర్తమంటే వింధ్యోత్తరభూమి అనే నమ్మకమున్నప్పటికీ.

* * *

### ది ఐసెన్‌హోవర్ బ్రదర్స్

రచయిత: బేలా కొర్నిట్జర్. (ప్రకాశకులు: కొలిన్స్ (కామెట్ బుక్స్)), మూల్యం: రూ 1.

అమెరికా అధ్యక్షుడు శ్రీ డ్వైట్ ఐసెన్‌హోవర్ — ఆరుగురు సోదరులలో ఒకడు. ఒకరు చనిపోయారు. ఐసెన్‌హోవర్ల వంశం పెద్ద కలిగినది కాదు. కష్టపడి పైకి వచ్చినవారు. అద్భుతకృత్యాలు—మనుష్యుల వేట, పెద్ద పెద్ద ఐశ్వర్యాల సంపాదన— చేసినవారు కాదు. ప్రస్తుత ఐసెన్‌హోవర్ సోదరుల తల్లిదండ్రులు ఒక ఆదర్శసంసారం. నిత్యజీవితం సుఖంగా గడుపుకొనడానికి ఇరవు ఏర్పర్చుకొని, పిల్లలకు చదువుచెప్పించుకున్నారు. ఆనాటి సాంఘిక పరిస్థితులను, నేటి ఐసెన్‌హోవర్ సోదరుల స్థితినీ ఈ ఇంగ్లీషు పుస్తకంలో చక్కగా వివరించారు.

### ఆరోగ్యపోషణ

(స్త్రీ పురుష విజ్ఞానము ---ప్రథమ భాగం)

రచయిత: ఆయుర్వేద భిషక్ వేమూరి శివరామకృష్ణశర్మ, సత్యనారాయణపురం. విజయవాడ. 2. మూల్యం: రూ. 1. పుటలు 76.

ఆయుర్వేదం దృష్ట్యా - స్త్రీ పురుష విజ్ఞానాన్ని—సుబోధకంగా వ్రాశారు శర్మగారు.

* * *

### ఆల్బర్ట్ ష్విట్జర్

రచయిత: జె. ఫైవ్యాట్, (ప్రకాశకులు: కాలిన్స్ (కామెట్ బుక్స్)). మూల్యం రూ. 1.

ఎక్కడోఉన్న ఆశ్రేస్ నుంచి ఆఫ్రికాకు వచ్చి నానావ్యాధులతో నానా బాధపడుతున్న ప్రజానీకానికి స్వయంగా వైద్యసహాయం చేసిన మహాపురుషుడు డాక్టర్ ఆల్బర్ట్ ష్విట్జర్. డాక్టర్ ఆల్బర్ట్ వైద్యుడేకాదు-గొప్ప తత్వవేత్త - సంగీతవేత్త. నల్లజాతులంటే అసహ్యించుకునే దొరకాదు. మానవ సేవ పరమావధిగా గలవాడు.

ఆఫ్రికాలో భరియైనదిండి, భాగ్యాలులేక వచ్చే జబ్బులనేకం. ఉదాహరణకు—నిద్రపోవడం ఒకజబ్బు— ఊరికే నిద్రపోతూనే ఉంటాడు. ఈలోగా చీమలుతినేస్తాయి! సత్వరం కొన్ని మందులు కావాలంటే అవి దూరాలనుంచి రావాలి - పైగా అవి త్వరగా వచ్చేటందుకు సదుపాయాలు లేవు. దానికితోడు అడవిజంతువులు కొన్ని సమస్యలను కలగజేస్తాయి. తీరా వైద్యంచేసినా, యూరపియన్లు కలగజేసిన జీవనోపాధుల మూలంగా. జబ్బులు వస్తూనే ఉంటాయి.

డాక్టరుష్విట్జర్ చరిత్ర ఒక్క 'మానవసేవ' నే సేకాక, ఆఫ్రికాలో ఆయన ఇతర అనుభవాలను కూడా చక్కగా చూపుతుంది.

ఒకప్రక్క ప్రకృతి - మరొకప్రక్క మానవరూపం దాల్చిన ప్రకృతి - వాటితో మానవత్వమే తన ప్రకృతిగాగల డాక్టరు ఆల్బర్ట్.

చదువదగినది - ఒక ప్రముఖ ఆదర్శ పురుషుని సంగతి.

జి. కె.

* * *

### "శ్రీ త్రిపురాంబా శతకము"

[రచన: శ్రీమారుపెద్ది గురుసుబ్రహ్మణ్యశర్మ, మేలకొండుంగాలూరు, కీళ్ కొడుంగాలూరు పోస్టు, వందవాశి తాలూకా.]

ఈ కృతి అమూల్యము. రచన: విశిష్ట మార్గములో ఉన్నది. కాంచీ కామకోటి పీఠాధిపతులు శ్రీ శ్రీ శ్రీ చంద్రశేఖరేంద్ర సరస్వతీ స్వాములవారికి అంకితము. మానసిక షోడశోపచార పూజాన్వితము.

ప్రారంభములో చంద్రమౌళీశ్వరుని స్తుతిస్తూ కవి ఛందోవిధానములో చూపిన కృతి సౌష్ఠవ్యం తెలియచేస్తున్నది. మత్తేభ, శార్దూల, సీసపద్యములు, పర్యలఘుకందమూ, నిరోష్ఠకందమూ ఇత్యాదులు ఉన్నాయి కొన్ని. తరువాత శతక రచన.

శతక రచన సాఫీగా నడుస్తుంది.

అచ్చిక బుచ్చికల్యులకనమ్మ!

నినుకా మదిదల్తు నమ్మని
ప్పచ్చరమంకొలంచి కృప
పైజలుకంగద కల్కిగూర్చి నీ
యుచ్చగదే జగాల సృజియింపగ
పెంపగ ముంపనమ్మ ని
న్నచ్చుపు బత్తిగొల్తు త్రిపురాంబ
మదంబ కదంబవాసినీ!

ఈలాగు ఉంటుంది నడక.

షోడశోపచారానివేదన ప్రకరణము అనే పేరుతో కరువు పోగొట్టవలసిందని అంబను వేడుకొంటూ కొన్ని పద్యాలు వ్రాశారు.

'జలములు లేమి పైరుపడజాలక
కర్షకులాందు వేదనల్
విలవిలదన్ని కొం చుమరు విడిచి
జీవులకైన బాధలుం
గలకల నవ్వుచుం గనుటకా ఇదిలేదే?
దయావిహీనవై
యాలుచెక జూడబోకు

త్రిపురాంబ మదంబ గదంబవాసినీ'

భక్తి పరమార్థానికే లాగుకొనిపోయేటు చాలా పద్యాలలో కనపడుతుంది.

* * *

### 'రాగ హృదయం'

[రచన: శ్రీ కె. వీరభద్రాచారి, శ్రీ పి యస్. ప్రకాశదీక్షితులు. ప్రతులకు: విజ్ఞానప్రభాస, భీమవరం. వెల 0-12-0]

రాగహృదయం సంగీతరూపకం.

అశ్వఘోషుడు ప్రభావతిని వలచి వలపుపంట పండుకోలేకపోయాడు. వలపు చిగిరించి, పుష్పించి రాగోదయాన్ని వికసింపచేసింది. అది మావిశాఖవలనే మసకుపడిపోయింది. అకస్మికంగాఅసన్న మరణపంజరములో చిక్కుకొని పోయిన ప్రభను వివిధంగానూచేసుకోలేక అశ్వఘోషుడు శాశ్వతంగా విపన్నుడై ఏకాంతవాసి అయిపోయాడు.

పదాలు మృదువుగా ఒకదానితో ఒకటి పొదుగుకొని రచనకు అందమిచ్చాయి. సమాసాలు అక్కడక్కడ సుదీర్ఘములైనా ముద్దుగా ఉన్నాయి. అక్కడక్కడ అర్థములో నిండుతనం లేకపోయినా రచన మాత్రం నిండుకుండలాగు ఉన్నది.

ఈ రూపకములో ఉన్న కొత్తదనం గమనించదగినది సూత్రధారి తిరుగా వచ్చి కథను సూచిస్తూ ఉండడము ఒకటి.

హృదయములు రెండూ రాగానికి రాగభరితములయిన పట్టు ముద్దుబగా ఉన్నాయి. ఆరంభములోనే రచయితలు కథావస్తువును

"అయం వసంత స్సౌమిత్రే
నానా విహగనాదితః
సీతయా విప్రహీనస్య
శోక సందీపనో మమ"— అనే శ్లోకమును అశ్వఘోషునిచే పలికించి సూచించారు.

ముఖాముఖిగా జరిగే నాయికా నాయకుల సంభాషణ పటాంతరన్యాసిని సూచిస్తూ రచనకు వన్నె తెచ్చింది.

బృందగానము, నేపథ్య పద్య పఠనమూ అతికినట్టు కనపడదు. కాని అంత మాత్రాన కథాగమనానికి వెలితిరాలేదు.

బృందగానములో ప్రభావతిని ఉద్దేశించి 'జయము కోమలకంతి'—అని అనడములో సుకుమారమైన అర్థం చట్టున స్ఫురించినట్లు కనపడదు. అది ప్రయోగవైచిత్యమును సూచిస్తుంది.

ప్రథ నదిలో మునిగిపోయిన తరువాత అశ్వఘోషుడు ప్రవేశించి

'ఓ సఖీ - ఓ ప్రభా! ఊర్వశీ
అందలేని పొందలేని
దివ్యోర్వశివైనావా.' - అంటాడు.

అంతలోనే ప్రభ ఊర్వశి అవడం విచిత్రభావన - వలచిన ప్రతి కాంతా జగత్తునుండి మరుగైతే ఊర్వశి అయిపోయినట్టు భావించడం ఏ సంప్రదాయమో తెలియదు.

* * *

### "వాణీ - వీణా"

[రచయిత: శ్రీ కర్లపాలెం నాగేశ్వర కవి, ప్రాప్తిస్థానం: ఆంధ్ర భారతీ ప్రకాశన మందిరం, పేటపాలెం, గుంటూరుజిల్లా. మూల్యం: 0-14-0]

అనుష్టుప్ ఛందస్సులో గీర్వాణవాణీ విన్యాసంకలన రచన ఇది. భిన్న భిన్న శీర్షికల క్రింద వ్రాసిన శ్లోకాలు. కథకోసం ప్రయత్నించి చదవ నక్కరలేదు. కవిగారికి కవలం సంస్కృత భాషపైకల అభినివేశమును తెలుసుకొనేందుకు ఈ చిన్న కృతి ఉపకరిస్తుంది.

దానిలో వేంకటేశ్వరస్తుతి, దయా, మాలవీయ విశ్వవిద్యాలయ ప్రశంసా, ఖాదీ, ప్రతాప, విద్యా యీ మొదలైన శీర్షికలతో ఆయా విషయాలను గూర్చి స్వీయాభిప్రాయాలు ఆవిష్కరిస్తూ పద్యరచన సాగించారు.

'సైనికమహర్షి' అనే శీర్షిక క్రింది శ్లోకాలు గాంధీజీ గుణగణాలను ఉద్ఘాటిస్తున్నాయి. ప్రతిశ్లోకం మొదటి అక్షరాలు చేర్చి చదివితే శ్రీ మోహనదాస కరమచందగాంధీ అనే పేరువస్తుంది. ఇదేవిధముగా.

'సంస్కృతిః' అనే శ్లోక సంచయములో విశ్వదాత శ్రీ నాగేశ్వరరావు పంతులుగారి నామమూర్తి కలుస్తుంది.

రచనలో ఛందోభంగం అక్కడక్కడ స్పష్టంగా ఉన్నా కవికిసంస్కృత కావ్య రచనపైగల అభినివేశం దానిని ఎంచవద్దని బోధిస్తుంది.

'గీతాంజలి మహాకావ్యం
విరచయ్య భారతేశవే
నోబులర్హై జీత సమ్మానం
ప్రాప్తంకన త్వయా వినా...'

ఇలాగే ఉంటుంది రచన......

* * *

### "కెరటాలు"

[రచన: శ్రీ రంగ శ్రీ అరుణసాహితి - మాచేడు, వయా చల్లపల్లి, వెల 0.8.0]

"ప్రతి రచనలో కాస్త ఆవేశ మెక్కువయే చెప్పవచ్చు. అందుకు చుట్టూ ఉన్న వాతావరణమే కారణమై ఉండవచ్చు."—అని సంపాదకులు నాగభూషేశ్వరరావుగారు అన్నారు 'మా మాట'లో.

ఇవన్నీ ఖండకృతులు. అన్నీ కలిసి 'కెరటాలు' అయాయి. లోగడ ఆయా పత్రికలలో వెలువడిన వేనట......

'మా మాట'లోనే సంపాదకులు
"ఏమైనానాకే కవిత్వం
మేలు కొలపాలిగాని
జోకొట్టకూడదు." - అని పునరుద్ఘాటించారు.

ఇందులోనివి కొన్ని తేటగీతాలు కూడాను. చాలా గేయములని అనుకోవచ్చు. 'కవిత్రి' శీర్షికలో వేమన్నను గూర్చి పడిన అభేదన ఇలా ఉంది.

'పాఠశాలకు జని విద్య బడయలేదు
చేరి గురువుకు శుశ్రూష చేయలేదు
కాని కవనము జెప్పెను మానితముగ
వేమన్న, వేయేల కవిగానె వెలసి
నాడా?'

వేమన్న ప్రకృతి క్రమింప సువిశాల పథము వేయ గ్రంథ మొకటి రచించి ఘనతపొందాడని రచయిత భావం ... వేమన్న 'వేమ్న' అవడంకూడా ప్రకృతినే సూచిస్తున్నట్టుంది.

'వియోగము' అనే గీత ఈ కవితా ముఖలో చాలాముంది యువకులైన రచయితలకు పరిపాటిగా వస్తున్న భావాలతో ఉన్నదే.

'వసంతవనవాటికా ఋతువేతెంచె
చెలీ! చెప్పు మిక చేరితి గనుచు
నీవికాస భూతిలకవనమునకు దూరమై
వియోగ విరహ వ్యధలకుపెల్లుచు భారమై'

ఈలాటి రచనలలో ఉండే భావ స్వాతంత్ర్యమును అరికట్టే శక్తి ఎవ్వరికీ లేదుగాని ఈ రచనవలన పాఠకులోకాన్ని ఎంతవరకూ మేలు కొల్పడం జరుగుతుందో చెప్పలేము.

సంపాదకు లన్నట్టు ఈ రచనలో ఆవేశమే ఎక్కువ కనబడుతుంది.

* * *

### "మాలతి, భారతి, పార్వతి"

[రచన: శ్రీ పసుపులేటి కోటేశ్వరరావు, టాగూరు ప్రచురణలు - తెనాలి. వెల: ఒకరూపాయి.]

రచయిత హృదయంలో ద్వేషానికి తావెక్కడిది? భావుకు డెప్పుడూ ద్వేషించలేడు. జాలిపడతాడు. కోపించలేడు. విలపిస్తాడు. ఒకటా స్త వికతను, ఒకకఠోర సత్యాన్ని చెప్పాల్సి వచ్చినపుడు ఒకింత ఉద్వేగపడతాడు. వీరి రచనల్లో ప్రధానంగా కనిపించేదదే—'పరిచయ వాక్యాలు'—

మొదటికథలో మాలతి, భారతి, పార్వతి అనే ముగ్గురి అమ్మాయిల జీవితాన్ని మూడుదశల మన స్తత్వాలకు ముడివేసి రచయిత నడిపిన విధానం ముచ్చటగా ఉంది. ఈ కథలో పాత్ర ప్రవేశం కూడా చిత్రంగానే ఉంది. పరిచయ వాక్యాలు పలికినంత ఉద్వేగం లేకపోయినా కథ హుందాగా నడిచింది. ఒక్కొక్క సన్నివేశం 'బొమ్మ గాబోలు' అని అనిపించుతుంది. భావుకత్వం ప్రశంసనీయం.

మిగిలిన మూడు కథలూ తీసి వేసేట్టుగా లేవు.

చివరికథలో మాత్రం-

రాఘవరావును అంత ద్విపాద పశువును చెయడం ఉద్వేగం కట్టతెగినట్టైపోయింది. పాకలో బ్రతుకుతీవ దిద్దుకొంటూ మొదట అంత పవిత్రంగానూ, కరకుగానూ ప్రవర్తించిన రవణ చివరకు జీవితాన్ని మైలపరచుకోడానికి మొగ్గినట్లు తీసుకురావడములో భావన దెబ్బతిన్నట్లు కనపడుతుంది. రవణ చచ్చిపోయింది రాఘవరావు పసువూ, దొంగా అయి పరువెత్తి పోయాడు. వాణికూడా బలవన్మరణానికి గురిచేసి కథ ముగిస్తారను కొన్నాను. అలాగు జరగలేదు. అదే ఏదో అనుకోలేని లోటుగా అగపడుతూంది.

మొత్తంమీద సాంఘికంగా ఉన్న కొన్ని దురాచారాలను దులిపి దుళ్లి కొట్టినట్టు చెప్పడములో శ్రీ కోటేశ్వరరావు సమర్థుడని యీ కృతివల్ల గ్రహించగలము.

* * *

### "వ్యాకరణ కౌముది"

[రచయితలు: శ్రీ పిసపాటి వేంకటేశ్వరులు శ్రీ పరిమి విశ్వనాథము. ప్రతులకు: పి. వి. లక్ష్మి ఇన్నీసుపేట - రాజమండ్రి. మూల్యము: 1-4-0.]

ఉన్నతపాఠశాలలలో నాలుగైదు ఫారములుచదివే విద్యార్థులకు సలక్షణమైన మాతృభాష పట్టుపడడం చాలా అవసరం. దేశీయమైనభాష ప్రశాఖీని అయినా మూలస్వరూపమును తెలిసికోవలసిన అవశ్యకత ఎప్పుడూ ఉంటుంది. సలక్షణమైనభాష కైవసమయిన తరువాత మేలిమిబంగారాన్ని వివిధరీతుల వాడుకొనేమాదిరిగా రచనలో ఉపయోగించుకోవచ్చు. భాషాస్వరూప స్వభావాలు తెలియక రచనసాగించడం నేలవిడిచి సాముచేసినట్లవుతుంది. ఏభాష నేర్చినా వ్యాకరణము నేర్వవలసినదే.

ఈనాడు ఉన్నత పాఠశాలలలో వ్యాకరణమునకు ప్రత్యేకించి కొంత సమయం నిర్ణయించియున్న పాఠ్యప్రణాళిక ననుసరించి రచయితలు ఈ పాఠ్యమును సృష్టించారు. ఇది మాతృభాషా స్వరూపస్వభావాలను గురించి కొంతవరకైనా విద్యార్థిని సక్రమమైన త్రోవలో నడుపుతుంది అనడానికి సందేహములేదు. ప్రకృతము ఎంత వలదన్నా వ్యాకరణాభ్యాసానికి ప్రభుత్వ పాఠ్యప్రణాళిక కొంత దోహదకారి అయి ఉన్నందువల్ల విద్యార్థి యీ గ్రంథాన్ని గురుముఖతః శ్రద్ధాబుద్ధులతో విని అభ్యసించవలసినదే. చదువుటకూ, వదివించుటకూ సులభమార్గమునుచూపి రచయితలు కృతకృత్యులయినారు.

ఇందు ఛందోవ్యాస రచనాభ్యాస క్రమంకూడా చేర్చినారు. అదికూడా సులభగ్రాహ్యముగానే ఉన్నది. కాని ఉన్నతకక్ష్యలకువచ్చిన విద్యార్థులకు 'గోవు' అనే శీర్షికతో జంతువర్ణన వ్యాసం ఇచ్చి 'అవులొక్క పురుష సంతానమే వృషభములు. ఇవి భూమిని దున్నును. బండి లాగును...ఇత్యాది వాక్యాలలో ఇంత చిన్న వ్యాసం ఉదాహరణకు ఇవ్వడం హేలనముగా ఉంటుంది. ఈలాటివ్యాసాలు ఒకటి రెండుఫారాల విద్యార్థులకు ఈవలసినవని నా ఉద్దేశం...భవతు. మొత్తం మీద నాలుగైదుఫారాల విద్యార్థులకే గ్రంథం చాలాసహాయమయిఉన్నది.

యామిజాల పద్మనాభస్వామి.

## ముక్త్యాలలో పుట్టి కురుపు పరిశోధన

### కేంద్రప్రభుత్వంచే రు 20 వేలు మంజూరు

ముక్త్యాల, జూలై 1: ఆయుర్వేద వైద్య విధానంతో పుట్టకురుపును చికిత్స చేసే నిమిత్తం పరిశోధన జరిపేందుకు "ఆర్య రసాయన శాలలో" "శ్రీ చంద్రమౌళీశ్వర పుట్టకురుపు పరిశోధనా కేంద్రం" అనే పేరుతో ఇటీవల ఒక ప్రత్యేక విభాగాన్ని నెలకొల్పారు.

ఈ విభాగానికి భారత ప్రభుత్వం ద్వితీయ పంచవర్ష ప్రణాళికలోని ఆయుర్వేదాభివృద్ధి కార్యక్రమాల క్రింద ఈ సంవత్సరం (1957-58) రు 29 వేలు మంజూరు చేసింది.

నూతనంగా ఏర్పాటు చేసిన ఈ సంస్థలో తపాడు 10 మందిపుట్టకురుపు రోగులకు చికిత్స చేసేందుకు వసతులున్నాయి.

## సవరణ

1-7-57 ఆంధ్ర పత్రికలో 2-వ పేజీలో 1-వ కాలంలో కన్య కావలెనని ప్రకటింపబడిన ప్రకటనలో 2-వ లైనులో "గొల్లయువకుని అనుమాట"కు బదులు "యాదవ యువకుని" పాఠకులు చదువుకొనవలెను.



Printed and Published for Nageswara Rao Estate (private) Ltd., by S. Radhakrishna at the Andhra Patrika Press, 6 & 7, Thambu Chetty Street, Madras-1. Editor S. Sambhuprasad.

## పింగాణీ పిల్లలు

న్యూయార్క్ (సైరాక్యూస్) ప్రదర్శనశాలలో బొమ్మ-శిల్పి శ్రీమతి అలైస్ స్పైరీ—పింగాణీ శిల్పంలో ప్రథమ బహుమతి వచ్చింది.

# సోమశిల ప్రాజెక్టు ప్రాధాన్యం

## శ్రీ జి. సి. కొండయ్య

ఈనెల 27 న కేంద్ర ఇరిగేషన్ ఉపమంత్రి శ్రీ హాథీ సోమశిల ప్రాజక్టు ప్రాంతము దర్శించారు. తరాల తరబడి నెల్లూరుజిల్లా ప్రజలు సోమశిల ప్రాజెక్టుకోసం చేస్తూండిన ఆందోళన ఇంతవరకూ కార్యరూపం ధరించలేదు. మంత్రిగారిరాకతో కొంతముందు జరుగ వచ్చునని ఆశించడం సమంజసము కూడాను.

కోవూరు, నెల్లూరు తాలూకాల్లో అధికభాగం పెన్నానది డెల్టా క్రింద వుంది. మిగిలిన జిల్లాలో కొంతభాగం వర్షంపై ఆధారపడిన చెరువులు, మరి కొంత భాగం ఆ అవకాశములు కూడా లేని కటిక మెట్ట ప్రాంతములతో నిండి వుంది. గూడూరునుండి-మద్రాసు సరిహద్దువరకూ రైలులో ప్రయాణం చేసిన వారికెవరికైనా - సిటిమొగ మెరుగక విశాలమైన భూభాగాలు కనుపిస్తాయి. అలాగే జిల్లాలు కొన్ని నాన్-డెల్టా ప్రాంతములు అతి హీనమైన ఆర్థిక దుస్థితికి లోనైవున్నాయి. ఇప్పుడు డెల్టాగాని, లేక అములులోవున్న చెరువులుగాని చాలా పురాతనమైనవి. చాలా చెరువులు పూడిపోయి - ఆరు మాసాలలో మూడుసార్లు నిండనిదే ఒక పైరు పూర్తిగా పండని పరిస్థితులలోకూడా వున్నాయి. సారవంతమైన భూప్రాంతములు వుండీ జిల్లా ఇట్టి పరిస్థితులకు లోనయి వుంది.

### సోమశిల

జిల్లాను రెండుగా విడగొట్టుతున్నట్లు పెన్నానది ఆత్మకూరు తాలూకా-కడప జిల్లా పరిహద్దులలో తూర్పు కనుమలను బ్రద్దలుచేసి నెల్లూరుజిల్లాలో ప్రవేశించుతుంది. సోమశిల అనే గ్రామం ఒక పుణ్యక్షేత్రం. వరుసగా పెన్నానది కిరువైపులా అనేక హిందూ దేవాలయాలు వెలశాయి. నెల్లూరుజిల్లాలోని సోమశిలకూడా అందులో ఒకటి. సోమశిల దేవాలయానికి పై భాగంలో ఎత్తయిన కొండల నడుమలమధ్య క్రిక్కిరిసినట్లు లోతుగా, వెడల్పు తక్కువగా నది ప్రవహించుతుంది.

ఇచ్చట నదిని ఆపివేసితే ప్రకృతిసిద్ధమైన, విశాలమైన సరస్సుగా ఒక రిజర్వాయర్ ఏర్పాటవుతుందని చెప్పను ఇంజనీరింగు తెలియనక్కరలేదు. గతంలో ఒకటి రెండుసార్లు కరువు కాటకాలు సంభవించినప్పుడు ఇచ్చట రిజర్వాయర్ కట్టాలనే తలంపు ఆంగ్ల పరిపాలకులకు కలగడం, ఆతలంపు ఫలించకపోవడం జరిగింది. ఆనాటి నుండి రైతులు ఈనాటివరకూ సోమశిల ప్రాజెక్టుకై నిరంతర ఆందోళన చేస్తూనే వున్నారు. ప్రతి ఎన్నికలలోనూజిల్లాలో ఇదో సమస్యగా తలయెత్తడం, ఎన్నికల అనంతరమే ప్రాజక్టు ఖాయమన్నట్లు రైతులు భావించడం తదుపరి ఆశాభంగం చెందడం సరిపాటి అయిపోయింది.

సోమశిలను అచ్చంగా కట్టేదానికన్నా, కృష్ణనీటిని పెన్నకు సిద్ధేశ్వరం ప్రాజక్టు ద్వారా దించీ, మద్రాసువరకూ నీటిసప్లయి శాశ్వతంగా చేయవచ్చునన్న తలంపుతో - క్రిష్ణా పెన్నా ప్రాజక్టు అంటూ మద్రాసు ప్రభుత్వం తలపెట్ట- కొంత పరిశీలనకూడా జరిపింది. అంటే సోమశిలవగ్గర పెద్ద రిజర్వాయరుకట్టడం అన్నమాట. అల్లా చేస్తే, కడపజిల్లాలో కొన్ని గ్రామాలు మునుగుతాయని ఆంధ్ర అవసరాలుఅల్లా వుంచిగా, మద్రాసుకు నీరమిటనే వివాదం తలయెత్తింది. ఏ పెద్దప్రాజక్టు కట్టినా కొన్ని వూళ్లు మునక తప్పదుగదా? భాక్రానంగల్ ప్రాజక్టు రెండువందలకు పైగా గ్రామాలు, ఒక ప్రసిద్ధపట్టణము నే ముంచేస్తుందిగదా? అందుకుతగిన నష్టపరిహారం చెల్లించి, వారికి వసతి చూపాలేగాని, అదో అభ్యంతరంగా భావించడం సరిఅయినది కానేరదు. మద్రాసుకు నీరిచ్చే విషయంలో కూడా ఆంధ్ర అవసరాలుతీరి, నీరుమిగిలివుంటే వారికి ఇస్తే అభ్యంతరముండనక్కర్లేదు.

కృష్ణనీటిని అంతకన్నా అవసర ప్రాంతాల కివ్వను నాగార్జున ప్రాజక్టు విషయం పైకిరాగానే సోమశిలను ప్రభుత్వం మరచిపోవడం శోచనీయం. సోమశిల ప్రాజక్టు నీరిచ్చే ప్రాంతాలకు నాగార్జున సాగరం సప్లయిచేయలేదు. అందువలన రెండింటికీ వైరుధ్యం లేదు. నాగార్జునసాగరం ప్రాజక్టు కుడికాలువను నెల్లూరుజిల్లాలో హైలెవలుకు మరలించితే, కనిగిరి, దర్శి, ఉదయగిరి తాలూకాలలో చాలా హెచ్చుస్థాయిలోవున్న భూములు కలిసివస్తాయి. ఆవిధంగా, నీటికొరత, తిండికొరతలో బాధపడుతున్న ఆ ప్రాంతముల కరువు తీరుతుంది.

నాగార్జునసాగరంప్రాజక్టుతో నెల్లూరు జిల్లాలో దక్షిణప్రాంతాలు, నదికిసమీపంలోనున్న ఉత్తరప్రాంతాలకు నీరందదు. ఆవిషయం యిప్పుడు మరింత స్పష్టమయిపోయింది. అందువలన మిగిలిన జిల్లాకంతా ఇక మిగిలినది సోమశిల ప్రాజెక్టు మాత్రమే.

అయితే పెన్నానదిలో తగినంతనీరు లేదని, అందువలన పెద్ద రిజర్వాయర్ కట్టి ప్రయోజనం లేదనేవాదం కూడా ఒకటి వినిపించింది. పెన్నానది జీవనది కాదు. కాని సంవత్సరములో ఆరు మాసాలు గొప్ప ప్రవాహంలో వుంటుంది. మూడు మాసాలు తగిన నీరు పారుతూనే వుంటుంది. ఆరువందల మైళ్ళు పొడవు కలిగినది. (సోమశిల డాము కట్టే ప్రాంతమునకు, సముద్రానికి 65 మైళ్ళు మాత్రమే వుంటుంది) లో నీరుండదనేది వాస్తవం కాదు. అందుకయినా తగిన మోతాదులో డాము నిర్మించి నది కిరువైపుల కాలువలు తీస్తే ఆరుమాసాలుగా ప్రవహించుతూ వృథాగా సముద్రంలో కలిసే ప్రవాహమంతా ఒక కారు పైరుకు చాలు.

పోతే జిల్లాలో చాలా చెరువులు వున్నాయి. ప్రవాహకాలంలో రెండుసార్లు చెరువులకు వదలినా ఎంతో ప్రయోజనం వుంటుంది. ఇప్పుడున్న డెల్టాలో నీటి ఇబ్బంది వచ్చినప్పుడు ఆదుకొంటుంది. అందువలన తక్కువ ఖర్చుతోనే డైవర్షన్ డాముగా కట్టను వీలుందని, తద్వారా ఇప్పుడున్న డెల్టాకు సహాయపడటమే గాకుండా చెరువులక్రింద సాగుకు నీటి గ్యారంటీ కుదరడమే గాకుండా కనీసం ఆరు లక్షల ఎకరములు సాగుకువచ్చే వీలున్నదని ఇంజనీరుల ఇతర ప్రవీణుల అభిప్రాయం. దీనానికి ఇండియాలో కట్టుతున్న అన్ని పెద్ద ప్రాజక్టులకన్నా సాగు ఉపయోగం, విలువలతో పోల్చినప్పుడు, ఇది అతిచవకగా తయారయ్యే ప్రాజక్టుఅని తెలుస్తూంది.

సోమశిలలేకుండా నెల్లూరు జిల్లాకు సంపూర్ణ మయిన నీటిసౌకర్యం ఇవ్వటం సాధ్యమయ్యేదికాదు. అంతేగాకుండా సోమశిల నిర్మించడంద్వారా నీరు వృథాగా సముద్రంలో పడిపోకుండా చేయవచ్చు నది కిరువైపుల రైతులు నీటి ఇబ్బందితో గిట్టుబాటుకాని వ్యవసాయంతో సతమతమవవలసిన దురదృష్టం కూడా తొలగిపోతుంది. ముందుముందు కృష్ణనీరు పెన్నలో కలిసినప్పుడు ఈ ప్రాజక్టు విలువ ఎంతో పెరుగుతుంది కూడాను. గోదావరిని కృష్ణలో కలిపి, కృష్ణనీటిని పెన్నలో ప్రవేశపెడితే పెన్నానదీ జలాలను కావేరిలో కలపడానికి సోమశిల ఒక పునాదికూడా కాగలదు.

కాని దురదృష్టవశాత్తు ఇంతవరకు యీ ప్రాజకు పంచవర్ష ప్రణాళికలలో చేరకపోవడం శోచనీయం. కేంద్రప్రభుత్వాన్ని అడిగితే - ఆంధ్ర ప్రభుత్వం సిఫారసు చేయలేదనటం, ఆంధ్ర ప్రభుత్వాన్ని అడిగితే-అది కేంద్రం విషయం గదా అని నోరు దప్పరించడంతో కాలం గడచిపోయింది. రెండవ పంచవర్ష ప్రణాళికలలో అవసరమైన ప్రాజెక్టలను ఇంకా చేర్పటంకొరకు అవకాశం వున్నది. కేంద్రప్రభుత్వ ఇరిగేషన్ డిప్యూటీ మంత్రిగారు సోమశిలను స్వయంగా చూస్తున్నారు. ఈ తరుణంలో నెల్లూరుజిల్లావాసులు గట్టిగా యీ విషయమై వివరించవలసివుంది. డెల్టాలో నీటి ఇబ్బంది తగిలినప్పుడు సప్లయిచేయను స్టోరేజిగా మాత్రమే సోమశిలదగ్గర ఆనకట్ట కట్టితే చాలు లెమ్మనే గుసగుసలు జరుగుతున్నట్లు వింటున్నాము. ఇది అతిసంకుచితము, స్వార్థముతోకూడిన ఆలోచన అనక తప్పదు. సోమశిలదగ్గర డ్యాము నిర్మించడము వీలున్న మెట్టప్రాంతములకంతా నీరు అందించను ఇరువైపులా సోమశిలనుండి కాలువలు త్రవ్వాలి. కనుపూరు-కావలి కాలువలకు అప్పుడు ఎంతో బలం, సౌకర్యం కూడాను. డెల్టాకు క్షేమం కూడాను. అందువలన దొంగలు పూర్తి పంచుకున్న చందంకాకుండా సోమశిల ప్రాజక్టు అవసరమయిన అన్ని ప్రాంతములకు వినియోగపడే పద్ధతిని డాము-కాలువలు కావాలని జిల్లా ప్రజలు ఏకముఖంగా ఆందోళనచేయాలి. తరతరాలుగా వెనుకపడిన నెల్లూరు జిల్లా మెట్టప్రాంత ప్రజలకు మోసం జరుగకుండా చూడడం అందరి విద్యుక్తధర్మం.

## మిల్లువస్త్రాల ఉత్పత్తిపెరుగుదల

### ఈ సంవత్సరం అభివృద్ధి

న్యూఢిల్లీ, జూలై 4 : ఈ సంవత్సరం మొదటి అయిదుమాసాల కాలంలోను, మిల్లువస్త్రాల ఉత్పత్తి, ఎగుమతులు అభివృద్ధి పొందాయి.

ఈఏడు జనవరినుంచి మే వరకు 22850 లక్షల గజాల మిల్లువస్త్రం ఉత్పత్తికాగా నిరుడు యిదేకాలంలో 21810 లక్షల గజాలుమాత్రం ఉత్పత్తి అయింది.

గ్త ఇదే కాలంలో దాదాపు 4025 లక్షల గజాల మిల్లువస్త్రం ఎగుమతి అయింది. గత సంవత్సరం మొదటి అయిదుమాసాల కాలంలో జరిగిన ఎగుమతులకంటె యిది 710 లక్షల గజాలు అధికం.

నూలుకూడా అధికంగానే ఉత్పత్తి అయింది. ఈ అయిదు మాసాలలో 7520 లక్షల పౌన్లనూలు తయారుకాగా గత సంవత్సరం యిదేకాలంలో 6650 లక్షల పౌన్ల ఉత్పత్తి అయింది.

## రక్షణశాఖ ఉపమంత్రి పర్యటన

తాంబరంలో సైనికావళిందన స్వీకారం

తాంబరంలో ఒక వాంపైర్ జెట్ విమానాన్ని చూస్తూ.

వైమానికశాఖకు చెందిన స్త్రీలు తాంబరంలో నడుపుతున్న ఆరోగ్యకేంద్రంలో.

## ప్రజలలో విరివిగా ప్రబోధం అవసరం

(6 వ పుట తరువాయి)

కూడా జరుగుతుంది." అన్నారు. ఆయన మద్యనిషేధశాఖామాత్యులుగా వున్నంతవరకు ఎట్టికమిటీల నియామకము జరిగియుండలేదు.

మా వేటపాలెం పట్టణ కాంగ్రెసు కమిటీ మా గ్రామ పరిసరాల్లో ఉత్పత్తి అవుతున్న దొంగ సారాయిని అరికట్టుటకు తీవ్రమైన కృషిచేశారు. పోలీసులకు ఎంతో సహకారమిచ్చారు. అప్పటి మద్యనిషేధశాఖామాత్యులు శ్రీ ఎ. బి. నాగేశ్వరరావు కూడా మా గ్రామము విచ్చేసి పట్టణ కాంగ్రెసు కమిటీ చేస్తున్న నిర్విరామకృషిని ప్రశంసించారు. ప్రభుత్వమువారు కమిటీసేవను గుర్తిస్తూ రూ 180/-లు నగదు రూపములో బహూకరించటమే కాక ప్రశంసా పత్రములు కూడా యొసంగియున్నారు.

ప్రజాస్వామ్యంలో ప్రభుత్వమంటే ఎవరో కారు. ప్రజలే ప్రభుత్వం, ప్రభుత్వమే ప్రజలు. ప్రతిదానికి ప్రభుత్వాన్ని విమర్శించటం భావ్యం కాదు. ప్రతి పౌరుడు ప్రజాస్వామ్య దేశంలో తన బాధ్యత తెలిసికొని ప్రవర్తిస్తే దేశము పురోగమిస్తుంది. ఎవరికి వారు వారి పరిసరాలలోని విషయాలను సేకరిస్తూ పోలీసు వారికి అందచేస్తూ ఉండాలి. యథార్థ విషయాలను కప్పిపుచ్చరాదు. అంతా పూనుకొని శ్రద్ధగా పనిచేసినప్పుడే ఏ చట్టమైనా విజయవంతము అయినట్లు చేసికొన గలుగుతాం.

కేంద్ర ప్లానింగుమంత్రి శ్రీ గుల్జారీలాల్ నందా, బొంబాయిరాష్ట్ర మద్యనిషేధ వారోత్సవాన్ని ప్రారంభిస్తూ ఇలా అన్నారు.

"ప్రజల ఆర్థికాభివృద్ధికి మద్యనిషేధం ఎంతో అవసరము. దానినిరద్దు చేయుట యన్నది ఎప్పటికీ జరగదు. దీనిని ప్రవేశపెట్టిన ప్రాంతాలన్నిటిలోను పేదతరగతి ప్రజల సంసారాలు చక్కబడినవి. మద్యపానంవల్ల ఆరోగ్యం, సంసారాల్లో సంతోషం అనేవి రెండూ నాశనం కాగలవు. ప్రజలు సహకరిస్తే తప్ప, మద్యనిషేధ నేరాలు తగ్గవు." ఈసందర్భములోనే రాజేంద్రప్రసాద్ ఒక సందేశం పంపుతూ, 'ప్రజలమనస్సు చెప్పి వారి సహకారం పొందగలిగితే తప్ప ఏ ప్రభుత్వం ఈ విషయంలో జయప్రదం కాజాలదు', అన్నారు. కాంగ్రెసు అధ్యక్షుడు, 'ఈ సంస్కరణ అమలు-బాధ్యత కేవలం అబ్కారీ శాఖ వారిదే కాదు. కేవలం ప్రభుత్వ నిర్బంధ చర్యలద్వారా ఏ సంఘసంస్కరణ అమలుజరగదు. ఇలాంటి సంస్కరణ అమలు బాధ్యత ప్రజలపైన వుండటమే గాక అసలు ప్రోద్బలం వారినుండే రావాలి', అన్నారు.

'ఈ చట్టం విమాత్రం విజయవంతం కాదు, తొలగించటం మంచిది', అని కొంతమంది పెద్దలే అంటున్నారు.

ఈమధ్యనే కేంద్ర మాజీ ఆరోగ్యశాఖా మంత్రిణి రాజకుమారి అమృతకౌర్, 'మద్యనిషేధ చట్టం ఎత్తివేయటం మంచిది. ఇది విజయవంతం కాలేదు. గాంధీ మహాత్ముడు సజీవుడయివుంటే ఆయనే తొలగించమని చెప్పివుండే వాడు', అన్నారు.

ప్రస్తుత మదరాసురాష్ట్ర హోం శాఖామాత్యులు శ్రీ భక్తవత్సలంగారు అమృతకౌర్ వెలిబుచ్చిన అభిప్రాయాన్ని వ్యతిరేకిస్తూ, 'మా మదరాసు రాష్ట్రం తప్పక మద్యనిషేధ చట్టం విజయవంతం చేసి చూపెట్టుతుంది', అన్నారు. ఈ తీరుగా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమువారు కూడా అమృతకౌర్ అభిప్రాయాన్ని వ్యతిరేకిస్తూ, మారాష్ట్రంలో కూడా విజయవంతం చేసి చూపెట్టుదాం', అని వెలిబుచ్చితే ఎంతో బాగుంటుంది.

ఇక నైనాము ప్రభుత్వం ప్రతి గ్రామములోను ఒక ప్రచారకమిటీ నియమించి ఆ కమిటీ పోలీసుశాఖ వారికి పూర్తి సహకార మిచ్చేటట్లు చూడాలి. ప్రబోధం ద్వారానే ప్రజల్లో పరివర్తన తీసుకొని రాగలుగుతాం.

ప్రస్తుతము నేరస్థులకు విధిస్తున్న శిక్షలు బహుస్వల్పం. ఒకసారి నేరము చేసిన వ్యక్తి శిక్షింపబడి తిరిగి రెండో నేరమునకు తయారవుతున్నాడు. శిక్షలు బహుకఠినంగా వుంటే నేరస్థులలో మార్పువచ్చి నేరాలసంఖ్య తగ్గుతుంది. ప్రభుత్వమువారు కొంతమంది రచయితలచే చక్కని ప్రబోధగీతాలు వ్రాయించి, వీటిని గాయకులచే రికార్డుచేయించి ఆ రికార్డులను ప్రచార కమిటీలకు అందచేస్తే బాగుంటుంది.

# సినిమా

## జంటనగరాలలో సినిమాలు

| | |
|---|---|
| సాగర్, పారడైజ్ | సంకల్పం (తెలుగు) |
| రాజేశ్వర్, కమల్ | సువర్ణసుందరి ,, |
| పారమౌంట్ | దొంగరాముడు ,, |
| రహత్ మహల్ | వీరకంకణం ,, |
| చిత్ర, తీకల్ | బలే బావ ,, |
| ప్రభాత్, అజంత | ఆధీరోటీ (హిందీ) |
| అశోక్, మనోహర్ | చంపాకలి ,, |
| పారమౌంట్, కృష్ణ, జయా | నకాబ్‌పోష్ ,, |
| సుభాష్ | చేతనా ,, |
| దిల్షాద్, దీపక్ మహల్ | బందీ ,, |
| లిబర్టీ, రాయల్ | షేరూ ,, |
| పాలెస్ | మిస్ ఇండియా ,, |
| మినర్వా | ఏక్‌హీ రాస్తా ,, |
| జంషెడ్ మహల్ | ప్యాసా ,, |
| వైట్ హౌస్ | While the City Sleeps |
| ప్లాజా | The Girl Can't Help It |
| డ్రీంలాండ్ | Simon and Laura |

## మద్రాసులో సినిమాలు

| | |
|---|---|
| వెలింగ్‌టన్ | అర్ధాంగి (తెలుగు) |
| గయిటీ, భారత్, మహాలక్ష్మి | తంగమలై రహస్యం (తమిళం) |
| కాసినో | మాయాబజార్ ,, |
| కపాలి ఎంగెల్ వీటు మహాలక్ష్మి ,, | |
| నవ్ | తిరుట్టురామన్ ,, |
| ఈరాజ్ | మణంగామడి ,, |
| మిడ్‌లాండ్ | పడత పైంకిలి (మలయాళం) |
| ప్లాజా | ప్యాసా (హిందీ) |
| రాజకుమారి | మునీంజీ ,, |
| స్టార్ | మిస్టర్ ఎక్స్ ,, |
| సెల్క్ట్ | భీమ ,, |
| పార్క్ | ఆవారా షాహజాదీ ,, |
| మహారాణి | నాగిన్ ,, |
| పరాని | సి. ఐ. డి. ,, |
| ఓడియన్ | Hollywood or Bust |
| న్యూగ్లోబ్ | Anastasia |
| న్యూ ఎల్ఫిన్‌స్టన్ | Lisbon |
| మినర్వా | The Opposite Sex |

## కొయ్య కొజులు

మైసూరులో తయారవుతున్న రమణీయ శిల్పభాండాలనుంచి



## దక్షిణ రైల్వే

### టెండరు నోటీసు

డిపార్టుమెంటు ద్వారా నిర్వహించే ఫలహారశాలలకు, కైనింగ కార్లకు 150 టన్నుల పచ్చిబియ్యం సప్లయి చేయుటకు నిర్ణయించిన ఫారములలో విడివిడిగా సీల్డు టెండరులు చీఫ్ కమర్షియల్ సూపరింటెండెంటు (కేటరింగ్ శాఖ) దక్షిణ రైల్వే, పార్క్‌టౌన్, మద్రాసు-3 వారిచే కోరబడుచున్నవి.

గమనిక :-150 టన్నులకు తక్కువగాను, కనీసం 50 టన్నులకు తక్కువ కాకుండా దాఖలు చేయబడిన టెండర్లు కూడా ఆలోచింపబడును.

(a) ఈ రైల్వేమీద వీలైన ఒక రైల్వేహెడ్ వద్ద డెలివరీకి వచ్చిన టెండరులు పరిశీలించెదరు.

(b) ఒకే టెండరుదారు ఒక స్టేషనునుంచి హెచ్చుచోట్ల సప్లయికి టెండరులు దాఖలు చేయవచ్చును. సప్లయి చేయవలసిన బియ్యపు రకాలైన అనగా నెల్లూరు బియ్యము (మొలకొలుకులు) కుసుమ, బసంగి, అక్కుళ్లు, సిరుమని, కృష్ణకాటుకలు, ఢిల్లీభోగాలు వగైరాలలో వీని సప్లయి చేయదలచిందీ మరచిపోకుండా టెండరుఫారములలో పేర్కొనాలి. "నెల్లూరు రకము (మొలకొలుకులు) మరియు ఢిల్లీభోగాల బియ్యమునకు ప్రాధాన్యత యివ్వబడును."

(c) అంగీకరించిన బియ్యపు మొత్తము విలువలో 75% డెలివరీ అయిన వెంటనే చెల్లించెదరు.

2. టెండరులను పంపదలచినవారు నిర్ణీతఫారములలో పంపవలెను. పచ్చి బియ్యము టెండరుఫారము 1-కి రు. 2 చొ॥న, (రూపాయలు రెండు మాత్రమే) స్వయముగా గానీ లేదా మనీఆర్డరు ద్వారా గాని ఎందుకు పంపుచున్నదీ వివరిస్తూ, చీఫ్ క్యాషియర్, దక్షిణరైల్వే, పార్క్‌టౌను, మదరాసు-3 వారికి చెల్లించి, ఈ క్రింది సంతకము చేసినవారి ఆఫీసునుంచి టెండరు ఫారములను పొందవచ్చును.

3. టెండరు ఫారములు మార్చబడవు. వాటికి చెల్లించిన డబ్బు వాపసు చేయబడదు. టెండరు ఫారములు 10-7-57 తేదీ మ. 12 గంటల తర్వాత విక్రయించరు.

4. బయానాసొమ్ము చెల్లింపును, టెండరు వగైరాలు పంపుటకు ఆఖరు తేదీలు, టెండరు చీఫ్ కాషియరు తీసికొనుటకు ఆఖరుతేదీ, ఈ క్రింద పేర్కొనబడింది.

| వరుస సెం. | సరకు పేరు. | చెల్లించవలసిన బయానా మొత్తం. | బయానా చెల్లింపు ఆఖరు తేదీ. (ఆరోజు మ. 3 గం॥ ల లోపుగా) | టెండర్లు పంపుటకు ఆఖరు తేదీ (ఆ తేదీ మ. 3 గం॥ లోగా. |
|---|---|---|---|---|
| 1. | పచ్చిబియ్యం | టెండరు విలువ మీద 2½% రు. 50 కు తగ్గకుండా. | 17-7-57 | 22-7-57 |

5. నిర్ణయించిన ఫారములలో రాబడిపన్ను చెల్లించిన ఒరిజనల్ సర్టిఫికేటును టెండరులకు జతపరచాలి.

6. ఇదివరకటి కంట్రాక్టు బాపతు రైల్వే అడ్మినిస్ట్రేషన్‌నుంచి రావలసిన సెక్యూరిటి డిపాజిట్లు, లేదా యితర మొత్తములు ఏమైన ఉండి ఉంటే ఈ టెండరుల బయానా సొమ్ముక్రింద ఏ పరిస్థితులలోను వాటిని సర్దుబాటు చేయబడవు. టెండరు ఫారం ధరగానీ, లేదా బయానా సొమ్ముగానీ రొక్కంగా, లేక మనీయార్డరుద్వారా సరాసరి చీఫ్ కేషియర్ కే పంపాలి. ఈ ఆఫీసుకు పంపగూడదు. ఇంకే ఏ విధముగా బయానాసొమ్ము డిపాజిట్టు చేసిన అంగీకరింపబడదు.

7. అన్నిటికన్నా తక్కువ టెండరును, లేదా ఏదో ఒక టెండరును అంగీకరించవలసిన బాధ్యత ఈ అడ్మినిస్ట్రేషనుకు లేదు. ఏదైన ఒక టెండరును నిరాకరించుటకు లేదా అంగీకరించుటకు యెట్టి కారణములను తెలుపవలసిన బాధ్యతకూడా లేదు మరియు కంట్రాక్టును ఒకరికంటె ఎక్కువమంది యిచ్చుటకున్నూ, భాగములుగా అవసరమని తోచినచో టెండరును అంగీకరించు అధికారముగూడ రిజర్వు చేసుకొనియున్నారు.

8. ఇతర వివరములకు, టెండరు ఫారములలో స్పష్టపరచిన షరతులను, నిబంధనలను చూడవలసినదిగా కోరుచున్నారు.

మద్రాసు, - - 1957. చీఫ్ కమర్షియల్ సూపరింటెండెంటు.